# రాజశేఖర చరిత్రము

శ్రీకృష్ణదేవరాయని యాస్థానకవులలోని

మాదయగారి మల్లన్న

ప్రణీతము.

ప్రకాశకులు

నందిరాజు చలపతిరావు.

మంజువాణీ ముద్రాక్షరశాల, ఏలూరు.

 [వెల. 0—8—0.

# విజ్ఞప్తి.

---

ఉత్కృష్టమగు ప్రౌఢ ప్రబంధములలో రాజశేఖర చరిత్ర మొక్కటి ఈ గ్రంథము యొక్క సంపూర్ణ ప్రతి నేను గుంటూరు కాలేజీలో చదువుకొనునప్పుడు మతుకుమల్లి సరస్వతి శాస్త్రులవారింట లభించినది. రావు బహద్దరు వీరేశలింగము పంతులవారు కవుల చరిత్రమును రచియించుచున్నారని తెలిసి, వారి కీకవి చరిత్రలోని కృతిపతి వర్ణనాదికములు మున్నగు విషయములతో గూడిన కవిచరిత్ర సంగ్రహముగా వ్రాసి పంపితిని.

తరువాత నొక వేసవి సెలవులలో నా తాళపత్ర గ్రంథమును కాకితములపై వ్రాసి పంతులువారికి పంపగా వారు ముద్రించిరి. కాని యా ప్రతులు లిప్పుడు లభింప కుండుటచేత పునర్ముద్రితము గావించితిని. భాషాపరులీ గ్రంథము నాదరింతురుగాక !

ఇట్లు,
భాషాపరుఁడు.
నందిరాజు చలపతిరావు.

# రాజశేఖరచరిత్రము.

ఈ రాజశేఖర చరిత్రమును రచించిన కవి మాదయ్యగారి మల్లన్న. ఈతనికి పూర్వము ఏకాదశీ మాహాత్మ్యమును రచించిన ప్రౌఢకవి మల్లన్న యొకడుండుటచేత నీతనిని మాదయ్యగారి మల్లన్న యనుచుండిరి. ఈత డఘోర శివాచార్యుని శిష్యుడు. శౌనక గోత్రుఁడు. అయ్యంకి పురాగ్రహారస్వామి; అయ్యంకి గ్రామము కృష్ణామండలములోని చల్లపల్లి సంస్థానములోనిది. ఈతడు రచించిన రాజశేఖర చరిత్రము మూడాశ్వాసముల రసవత్కావ్యము.




క. చెప్పఁదగుఁ గవిత రసముల్
చిప్పిల నప్పప్ప బళిబళీ యనలేదా
యెప్పుడుఁ జేయక యుండుటె
యొప్పఁజుమీ సుకవి కెంత యుచితజ్ఞుఁడొకో.

ఈతని కవిత్వము నిర్దుష్టమై ప్రౌఢభావ విలసితమై, రసవంతమై, యనర్గళధారా విలసితమై, మనోజ్ఞకముగా నుండును.

శా. గాఢార్థ ప్రతిపాదన క్రమకళా కౌశల్యముల్లేక, వా
చా ధట్కార్భటితోడఁ దామ తమ మర్ఝాయించుఁ గైవారముల్
ప్రౌఢిం జేయుచుఁ బ్రాజ్ఞులన్నగుచు గర్వగ్రంథులై యుండు న
మ్మూఢస్వాంతుల మెచ్చకుండుటయె సమ్మోదంబు మాబోంట్లకున్.

అని కవితారచన కొక మార్గమును నిర్దేశించి యట్లే తన కావ్యమును నిర్వహించెను.

ఇతర ప్రబంధముల వలె వర్ణనా బాహుళ్యముతో సరిపెట్టి కథావస్తువును పెండ్లి, వేటలతో సరిపెట్టక కళాపూర్ణోదయమువలె, విచిత్రతర కల్పనలు పొంపిరి పోవునట్లు కథా వైచిత్రిని గల్పించి, తన యనల్ప కల్పనా కౌశలిని వెల్లడించెను.

కవికాల నిర్ణయమునకు కృతిపతి నాదిండ్ల అప్పామాత్యుని కాలము సహకారిగా నున్నది. నాదిండ్ల అప్పామాత్యుఁడు ఆఱువేల

నియోగి బ్రాహ్మణుఁడు. కృష్ణమాంబా కుమారుడు, మంత్రియు, దండనాథుడును. ఈతడు శ్రీకృష్ణ దేవరాయని మంత్రియైన తిమ్మరుసు మంత్రికి అల్లుడు. ఈ అప్పామాత్యుఁడు తిమ్మరుసు మంత్రి కూతురు తిరుమలాంబను వివాహమాడినట్లీ పద్యములలో వర్ణించెను.

సీ. ఏమంత్రిమణి నిజస్వామి కార్యక్రియాతత్పరమాన సోత్సాహశాలి
యేమంత్రిమణి మిత్రహితబాంధవాశ్రిత ప్రకరరక్షణకళా ప్రౌఢబుద్ధి
యేమంత్రిమణి వచోవిహేలాతి నైర్మల్యశీతలతా ధూతశీతరోచి
యేమంత్రిమణి సుధాధామశాంభవ ధామధామధళ్యసుతుల్య ధవళకీర్తి

గీ. యతఁడు మంత్రికులోత్తంస మహితనృపతి। పటలమకుటాగ్రఘటిత పత్పద్మయుగళి
సకలకర్ణాట రక్షావిచక్షణుండు। దీనసురశాఖి సాళువతిమ్మమంత్రి

గీ. అమ్మహామంత్రి శేఖరుం డతనియర్ధాంగలక్ష్మి। సకలపుణ్యాంగనా జనశ్లాఘనీయ
లక్ష్మమాంబకు నుదయించి లలిని మెఱయు। తిరుమలాంబిక బెండ్లియై తేజరిల్లె.

కావున నీ కవి శ్రీకృష్ణ దేవయరాలకాలము అనగా 1540 సంవత్సర ప్రాంతమున నుండెననుట నిర్వివాదము.

కవితా శైలి దెలియుటకై క్రింది పద్యములు దాహరింపబడు చున్నవి.

ఉ. చెప్పెడి దేమి నవ్వుచు రచించినమాటలు రాము బాణముల్
దప్పినఁ దప్పఁ డాశ్రిత కలాపము ముంగిటనున్న వేలుపుం
దిప్ప వివేక శాలి యువతీజన చిత్త వినూత్న దర్పకుం
డప్పన మంత్రివానిఁ దరమా నుతియింప నిలింపకోటికిన్.

ఉ. రాహువుగాను నిన్నరగ రాచిన శూలిని గాను సీతను
ద్రోహము చేసినట్టి యలరోహిణి తండ్రిని గాను దజ్జగ
న్మోహిని నీలనీలకచ ముద్దుల చక్కెర బొమ్మఁ గూర్పక
యో! హరిణాంక తావక మయూఖ ముఖంబుల నేచ నేటికిన్.

మ. కటి శాటీ భవదేణ కృత్తితను జాగ్రన్నాకులే కాగ్రి దృ
క్పుటి లాలాట సమర్పి తాంజలి రమాంభోజాననా నాయకో

చ. ఎలుకల రాచతేజి నెఱ ♦ యెక్కుడుగాఁ దపరంజిపైఁడి ని
గ్గులుగల మేనిపెన్వడును ♦ క్రొన్నెల దాలుపు ముద్దుపట్టి కొ
మ్ములుగల వేల్పు విఘ్నతను ♦ మూలముఁబం బెకలించు బల్లి దుం
డలగణ భర్త యప్పనచి ♦ వాగ్రణి కీవుత నీప్సి తార్థముల్. 5

క. ఆ కాళిదాస ముఖ్య
వ్యాకోచవచో విలాసు ♦ లగు నామర భా
షా కవివర్యులకు నమో
వాకంబొనరించి యే న ♦ వారిత భక్తిన్. 6

గీ. సరస సంస్కృత పుష్ప గు ♦ చ్ఛ ప్రభూత
మగు తెనుంగను నెత్తావి ♦ కఖిల దిశలఁ
దరుణ పవమానమగు కవి ♦ త్రయ విశేష
చతుర వాచా నిరూఢి కం ♦ జలి యొనర్చు. 7

క. చెప్పఁదగుఁ గవిత రసము
ల్చిప్పిల నప్పప్ప బళి బ ♦ ళీ యనలేదా
మెప్పును చేయక యుండుట
యొప్పునుమీ సుకవి యెంత ♦ యుచితజ్ఞుఁడొకో. 8

శా. గాఢార్థ ప్రతిపాదన క్రమ కళా ♦ కౌశల్య ముల్లేక వా
చాడక్కార్భటితోడఁ దామ తము మ♦ర్త్యాయుంచుఁ గైవారముల్
ప్రౌఢిన్ జేయుచుఁ బ్రాజ్ఞులన్నగుచు గ ♦ ర్వగ్రంథులైయుండు న
మ్మూఢస్వాంతుల మెచ్చకుండుటయ స♦మ్మోదంబుమాబోంట్లకున్

వ. అని యిష్టదేవతా ప్రార్థనంబును బురాతన చతుర సుకవి ప్రశంస
నంబును గుకవి నిరసనంబును గావించి యేనొక్క మహాప్రబంధంబు
నిర్మింపఁ దలఁచియున్న సమయంబున. 10

## కృతిపతి ప్రశంస

సీ. భట్టియుగంధర ♦ ప్రముఖుల కృత్యంబు
లొరగు లొత్తెడు మంత్రి ♦ లొక్కవంక

విక్రమార్కోదగ్ర ♦ విక్రమక్రమ కళల్
    లెక్క-చేయని శూప ♦ లోక్కవంక
శేషాహిభాషా వి ♦ శేషంబు మెచ్చక
    యుండు విద్వద్భ్యహ్మ ♦ లోక్కవంకఁ
గళివాహనులఁ ♦ గవితాప్రగల్భత
    నొందయు సత్కవివస్య ♦ లోక్కవంకఁ
గీ. దానమానక్రియానూన ♦ గాన సరణి
వెలయు తుంబురు నార ♦ దాదుల గణించి
యుల్లసంబాడఁ గాయకు ♦ లోక్కవంక
మహిమఁ గొలువంగ నప్పన ♦ మంత్రివరుఁడు. 11

క. పేరోలగ ముండి కవి
తాస్వాదన విశేషగోష్ఠి ♦ నాలించు తమిన్
రారమ్మని నను బిలిచి సు
ధారస మధురోక్తిఁ బలికెఁ ♦ దద్దయుఁ బ్రీతిన్. 12

ఉ. శంకర పాదసేవన వ ♦ శంవదమానస పంకజాత ని
శ్శంక వచోవిలాస రుచి ♦ సారవిసర్జిత పూర్ణపూర్ణి మై
ణాంక దురక్షరానన భ ♦ యంకర శౌనకగోత్ర పాత్రియ
య్యంకి పురాగ్రహార విభ ♦ వాకర మాదయ మల్లసత్కవీ. 13

క. నీ విపుడు చెప్పఁ దలఁచిన
భావరసోద్యన్మహా ప్ర ♦ బంధము నాపైఁ
గావింపు మంకితంబుగఁ
గోవిద హృదయ ప్రమోద ♦ గుంభిత ఫణితిన్. 14

వ. అని సబహుమానంబుగాఁ గర్పూర తాంబూలానర్ఘ్య మణిమయాం బరాదు లొసంగిన బ్రీతచేతస్కుండనై యంగీకరించి నా రచియింపం బూనిన యిమ్మహా ప్రబంధంబునకు సార ఘనసార ప్రాయం బగు నాయకుని వంశావతారం బభివర్ణించెద. 15

## కృతిపతివంశవర్ణనము.

శా. శశ్వత్తీవ్ర తపోమహామహిమచే ♦ జంభాసురద్వేట్పురీ
విశ్వైశ్వర్యకళాసమృద్ధి సరిగా ♦ వేర్వేర నిర్మించి వే
దశ్వాసుండగు వేల్పుఁజేసి కెనయై ♦ తానుంచె నేమాని యా
విశ్వామిత్రమునీంద్రు మాయుక మనో ♦ వీథిం బ్రశంసించెదన్. 16

క. ఆకౌశిక వంశాబుధి
రాకాహిమరోచి సచివ ♦ రత్నము పుణ్య
శ్లోకుఁడు వితరణరేఖా
నాకానోకహము మంత్రి ♦ నాయన వెలసెన్. 17

చ. అతనికి సింగమాంబకు మ ♦ హామహు లాశ్రిత వజ్రపంజరుల్
సుతులు జనించి రంచిత వ ♦ చోరచనాఫణి భర్తలోక స
న్నుత నుతిమార్గవర్తనుఁడు ♦ మాదయ మంత్రియు గంగనార్యుఁడున్
గత కలి కల్మషుండు చిటి ♦ గంగనయు న్నిగమ త్రయా కృతిన్. 18

ఉ. సాళున నారసింహ మను ♦ జప్రభు కార్యకళాదురంధరుం
డై లవణాబ్ధివేష్టిత ధ ♦ రాధిప దుర్మత మంత్ర మంత్రి శుం
డాలవితాన కేసరి య ♦ నంగ ననంగసమాన రూప రే
ఖా లలితాంగుఁ డట్టి చిటి ♦ గంగన యొప్పు గుణానుషంగుఁడై. 19

శా. అంగాధీశ కళింగరాజ మగధా ♦ ద్యత్యూది భూభృత్సభా
రంగాభంగ విహారముల్ ఘనశిలా ♦ గ్రావస్థలీ సంసర
ద్గంగోత్తుంగ తరంగ నిర్గళిత ని ♦ ధ్వానోద్భట ప్రక్రియా
సాంగత్యంబులు చిట్టిగంగవిభు వా ♦ చాసంభ్ర మారంభముల్. 20

క. అందగ్రజానకు ధృతి జిత
మందర కుధరునకు మాద ♦ మంత్రికి సౌంద
ర్యేందిర యగు నమలాంబకు
నందనులు జనించి రార్య ♦ నందితులగుచున్. 21

శా. ఆహార్యోన్నతి సన్నపార్శ్వుఁడును సిం ♦ గామాత్యుఁడున్ సర్వ వి
ద్యా రాజీవభవాకృతిన్ వరద దం ♦ డాధీశుఁడున్ మంత్రి చూ
డారత్నంబగు మాధవుండు నరిశా ♦ డ్వర్గచ్ఛిదాపాదన
శ్రీరామాపరమూర్తి యాతఁడనఁగా ♦ శ్రీరామభద్రాఖ్యుఁడున్. 22

గీ. అందు వరదయమంత్రి సం ♦ క్రందనునకు
గోపమాంబకు నుదయించి ♦ రాపగేంద్ర
సన్నిభులు తిమ్మనార్యుఁడు ♦ జన్నతిమ్మ
ఘనుఁడు గొండయమంత్రి పుం ♦ గవుఁడు ననఁగ. 23

ఉ. వారలలోన నగ్రజుఁ డ ♦ వారిత శౌర్యుఁడు తిమ్మమంత్రి మం
దార ముదగ్రదోరసి వి ♦ దారిత దారుణవైరి వీరకం
ఠీరవ కంఠశోణితధు ♦ నీ ఘనఫేన విభాసి తత్పత
ద్యూభరిసితాతపత్ర రణ ♦ భూమియతం డొక మంత్రిమాత్రుఁడే. 24

శా. నాదిండ్లాన్వయవార్ధి శీతరుచి డా ♦ నక్షాత్రసంపన్నుఁ డా
శాదంతావళ దంత కుంత పటల ♦ స్పర్ధాళు సత్కీర్తి నా
నాదేశ క్షితిపాల మంత్రికుల ర ♦ త్నం బాశ్రితవ్రాత వీ
తూదాక్షిణ్య నివాసభూమియని లో ♦ కఖ్యాతి మించె న్మహిన్. 25

గీ. సత్యగుణశీలి యమ్మహా ♦ సచివమణికిఁ
గృష్ణమాంబకుఁ గోనమం ♦ త్రీశ్వరుండు
భాగ్యసంపన్నుఁ డప్పన ♦ ప్రభుఁడు గోప
దండనాథుండుఁ బుట్టి ♦ రుద్దండలీల. 26

ఉ. ప్రాపిత రాజ్యవైభవ ని ♦ రాకృత పాకవిరోధియైన యా
గోపనమంత్రి ధర్మ ధన ♦ గోపన సమ్మతి గుత్తి దుర్గ ల
క్ష్మీపరిపాలన క్రమ స ♦ మిద్ధ భుజాబలశాలి రూప రే
ఖా పరమత్స్యలాంచనుఁ డ ♦ యాహవ కార్యధురంధరుం డిలన్.

సీ. శీతలాకృతిఁ గొంత ♦ చెప్పంగఁదగుఁ జంద్రు
నెలనెల నుష్ణాంశుఁ ♦ గలయఁడేని

వితరణస్ఫీతిఁ గొంత ♦ ప్రతివచ్చు మేఘుండు
చపలానుషంగంబు ♦ సడలెనేని
భోగసంపదఁ గొంత ♦ పురుహూతుఁ డను నింద్రుఁ
(బాకారి) యనుపేరఁ ♦ బరఁగఁడేని
సౌందర్యమునఁ గొంత ♦ సరివత్తు రాశ్వినే
యులు భేషజంబూని ♦ యుండరేని

గీ. కొంతయెనవచ్చు గాంభీర్య ♦ గుణమునందు
నంబుధిస్వామి యొకవేళ ♦ నడఁగఁడేని
యనఁగ సర్వగుణ ఖ్యాతి ♦ నతిశయిల్లె
మానధనరాశి గోపన ♦ మంత్రివరుఁడు. 28

క. ఆయనుఁగుం దమ్ముఁడు విన
యాయతమతిఁ గొల్వ నప్ప ♦ నార్యుఁడు నతఁడున్.
బాయకయన్యోన్య ప్రియు
లై యలరిరి రామలక్ష్మ ♦ ణాకృతు లగుచున్. 29

క. ఆయప్పమంత్రి గుణములు
వేయి తెలుఁగులఁ జెలంగి ♦ వినుతి యొనర్పన్
డాయుఁగఁ గాకోదర కుల
నాయకునకుఁగాక కవిజ ♦ నంబుల తరమే. 30

సీ. నిజకీర్తి జలధి కు ♦ న్నిద్రగుణస్ఫూర్తి
నిత్యపూర్ణేందుగా ♦ నిలిపినాఁడు
కరహేతి పరశిరః ♦ క్రమకిరీటాగ్ర
పీఠులపై వాడిఁ ♦ బెట్టినాఁడు
ధరదాల్పు హరిదంత ♦ దంతిసంతానంబు
మూలకుముట్టఁగాఁ ♦ దోలినాఁడు
బాహానిరోధాధి గ ♦ ర్వముచూప వచ్చిన
శేషాహినాలుకల్ ♦ చీరినాఁడు

గీ. కపటరాజన్యమంత్రి మ ♦ ద్గర్వభార
తిమిరపటలంబు శేముషీ ♦ తీవ్రభాను
భానుమాలికచేఁ బటా ♦ పంచచేసి
వెలసినాఁడన నప్పన ♦ విభుతఁగాంచె. 31

మ. పలుమాఱుంబు ధరంబు మాపు బహుమా ♦ నంబుంబరాసక్తి శీ
తలభానుండును బొట్టపెంచుటకు నై ♦ తాల్చుంగళాప్రౌఢి ని
చ్చలు వారింపఁ జరించు వారినిధి యా ♦ శాబద్ధుఁడై వీరలన్
దిలకింపందగునోటు దాతలని నా ♦ దిండ్లప్పనిం జెప్పఁగాన్. 32

సీ. ఏమంత్రిమణి నిజ ♦ స్వామికార్య క్రియా
తత్పరమాన సో ♦ త్సాహశాలి
యేమంత్రి మణిమిత్ర ♦ హితబాంధవాశ్రిత
ప్రకర రక్షణ కళా ♦ ప్రౌఢిబుద్ధి
యేమంత్రిమణి వచో ♦ హేలాతి నైర్మల్య
శీతలతా ధూత ♦ శీతరోచి
యేమంత్రిమణి సుధా ♦ ధామశాంభవధామ
ధాళధళ్యసుతుల్య ♦ ధవళకీర్తి

గీ. యట్టిమంత్రికులోత్తంస ♦ మహిత నృపతి
పటలమకుటాగ్రఘటిత ప ♦ త్పద్మయుగళి
సకలకర్ణాట రక్షావి ♦ చక్షణుండు
దీన సురశాఖి సాళువ ♦ తిమ్మమంత్రి. 33

గీ. అమ్మహామంత్రి కతని య ♦ ర్ధాంగ లక్ష్మి
సకలపుణ్యాంగనా జన ♦ శ్లాఘనీయ
లక్ష్మమాంబకు నుదయించి ♦ లలిని మెఱయు
తిరుమలాంబికఁ బెండ్లియై ♦ తేజరిల్లె. 34

ఉ. చెప్పెడిదేమి నవ్వచు ర ♦ చించిన మాటలు రాము బాణముల్
దప్పినఁ దప్పఁ డాశ్రిత క ♦ లాపము ముంగిట నున్న వేలుపుం

దిప్పు వివేకశాలి యువ ♦ తీజన చిత్త వినూత్నదర్పకుం
డప్పను మంత్రి వానిం దర ♦ మా నుతియింప నిలింపకోటికిన్. 35

శా. నాడింక్షప్పని శుభ్రకీర్తు లమృతాం ♦ ధస్సింధు వీచీఘటా
తాదాత్మ్యంబు వహింపఁబోలు నదిగా ♦ దా తద్భుజా పీఠికా
ప్రాదుర్భూత పటుప్రతాప సుషమా ♦ భర్మాంబు జాతచ్ఛటా
శ్రీదాంపత్యము చూపు నెవ్వఁడు నభ ♦ స్సీమ న్విజృంభించుచున్.

క. అప్పనవెట్టకనాదిం
డ్లప్పన చేతికి నొసఁగు ♦ నభిమత ఫలముల్
తెప్పలుగాఁ గోకొమ్మని
యప్పనఁగా నెఱుఁగ ♦ రెందు యాచకముఖ్యుల్. 37

ష ష్ఠ్య ం త ము లు.

క. ఈదృగ్గుణాహి కర్ణున
కాదర సల్లపన నవకృ ♦ తాహృతి చాతు
ర్యోదయ చక్షుః కర్ణున
కాదిమ వైష్ణవ కథా ని ♦ యత కర్ణునకున్. 38

క. కుటిలారి భయదసే నా
ర్భటికిన్ బలశౌర్య నిలయ ♦ పటికిన్ రాధా
విటమంత్ర లిఖితమతి సం
పుటికిన్ స్వత్రా మృతాన్న ♦ పోషిత జటికిన్. 39

క. దంభేతర మతిగతి సో
హంభావమ్మతికి సంభృ ♦ తావని బాహా
స్తంభధృత కుంభినీధర
కుంభీనస జరఠకమఠ ♦ కుంభీ తతికిన్. 40

క. శ్రీకవి తాపఘనోద్ఘు
ష్యా (?) కోటి నవీన రోమ ♦ సంఘు మిషు వస
న్లోకోత్తర గుణబీజా
స్తోకాంకుర నిధికి దాన ♦ దుగ్ధాంబుధికిన్. 41

క. శీలవదాళి విధాతకు
సాళువ తిమ్మప్రధాన ♦ జామాతకు ను
ద్వేల స్వప్న విజిత
త్రైలోక్య చరాచర ప్ర ♦ దాతకుఁ బ్రీతిన్. 42

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నామొనర్పంబూనిన యిమ్మహాప్రబం
ధంబు నకుం బ్రధాన కారణంబగు నావంచిక పురంబెట్టిదనిన 43

కథా ప్రారంభము.

సీ. సౌధచరద్వధూ ♦ జన దర్పణీ భవ
ద్దివ్యాలోక స్రవం ♦ తీ జలంబు
రజత వప్రస్థాణు ♦ గజచర్మశాటీ భ
వత్పరిఖా వారి ♦ వలయితంబు
శాత మన్యవ శిలా ♦ స్థగిత కాంచీదామ
భాసురోపవనాళి ♦ పరివృతంబు
పౌరప్రతాప వి ♦ భ్రాంతి కృత్కుట్టిమ
స్థలశోణమణిరుచి ♦ స్థపుటితంబు
గీ. బహువిధామోద మోదిత ♦ భసల కలభ
విసర విస్ఫురద్ఝుంకార ♦ వేణు నినద
సరస గాయక గాన ప్ర ♦ సంగ సౌఖ్య
కరణ కరమగు నావంచి ♦ కాఖ్యపురము. 44

శా. నీడల్వాఱు పసిండి మేడలపయిన్ ♦ నీలాలకల్ పుట్ట చెం
డాడం దాఁకిన కందుగాని శశియుం ♦ దంకంబుగాదంచు వా
దాడన్ వచ్చిన యంకకానికిఁ దదీ ♦ యాశంకతో మీటిపెన్
బ్రోడల్ తోడ్కొనిపోయి చూపుదురు త ♦ న్నూత్నక్రియాకేళికల్.

ఉ. వారణ వారకర్ణ పుట ♦ వాత కిశోర విసార సారక
ర్పూర పరాగముల్ నెఱయఁ ♦ బో పురవీధులఁ దారతార ము
క్తా రమణీయ మంటప వి ♦ తాన వినిర్గత కాంతి వాహినీ
పూరములోపలం గలయఁ ♦ బొల్చు వినిర్మల వాలుకాకృతిన్. 46

ఉ. వాడల వాడలన్ మెఱయు ♦ వారవధూటుల వక్త్రపద్మ సం
క్రీడ దనూనవాసనకుఁ ♦ గేలిసరోవర ఫుల్ల హల్లక
క్రోడ సుగంధిగంధముల ♦ కుం గలహంబులు చక్కఁబెట్టి చె
ల్లాడఁగఁజేయు సజ్జను క్రి ♦ యన్ మలయాచల వాతపోతముల్. 47

ఉ. గబ్బి పిసాళి వాలుఁ దెలి ♦ కన్నుల తేటమిటారి చూపులన్
మబ్బుకొనంగఁజేసి విటమానసముల్ ♦ దమివెల్లి ముంపుచున్
గుబ్బమెఱుంగుఁ జన్నుఁగవ ♦ కుంకుమపూఁతల కమ్మతావి యూ
గుబ్బులుగాఁ జరింపుదురు ♦ కొమ్మలు తత్పురమార్గవీథులన్. 48

చ. అరవిరిబాగుతో నలసు ♦ లమ్ము లతాంగుల లేఁత నవ్వులన్
బెరసి సరంబు లప్పటికిఁ ♦ బెంపు వహించుట జేసి చూపరుల్
గర మనురక్తిమై నిలిచి ♦ కైకొని పిమ్మటబోయి చూచి యా
సరములుగావు పొమ్మనుచు ♦ సారెకుఁగ్రమ్మఱ వత్తు రేమనన్. 49

ఉ. కాఁకరపండువంటి జిగి ♦ గల్గినమేలి పసిండిఛాత్రికిన్
ప్రేఁకము ద్రవ్వి పోసినను ♦ వేయియుగంబులు చెల్లుధాన్యముల్
పోఁకకుఁబుట్టెఁడమ్మినను ♦ బోనొక కల్పము పట్టుఁజూడ్కి పే
రేఁకటి దీఱ వైశ్యపతు ♦ లిండ్లుగనుంగొన నొప్పునప్పురిన్. 50

క. అన్నగరి చిఱుత యేనుఁగు
గున్నలపై నెక్కినిక్కి ♦ కోయఁగవచ్చున్
మిన్నేటి పసిఁడితామర
లన్నన్ మఱియేమిచెప్ప ♦ నందలి కరులన్. 51

చ. బిసరుహబంధు కొండచఱిఁ ♦ బెట్టుటయొండెఁ బయోధినీటిలో
మసలకవైచుటొండె సడు ♦ మన్నిలఁ బట్టఁగరావు వాగవె
క్కసములు మాకు నెందుసరి ♦ గావుసుమీయని యాడుచుండు సం
తసమున భానురథ్యములఁ ♦ దత్పురితుంగ తురంగ సంఘముల్. 52

వ. మఱియు నప్పురంబు పురందరశిలాశకలనికర నిచిత రచిత వప్ర ప్రభా
పూరంబులు పురరాజ పట్టాభిషేచ నోచిత కచ నిచయ గళిత కళి
తోల్పల కందళంబులంబోలి పొలయు నికటఘట యంత్ర సలిల సం

వర్ధితారామ స్థల పరితోదార శాలికేదారంబులు సతత సన్నిహిత దర్పక కల్పితానల్ప కనకమయ వేదికలంబోలి మించ సంగీతంబై యంగజహార శరీరంబును, నయోధ్యా పురంబునుంబోలి సదా రామాభిరామ క్రీడావర్ణనీయంబై విష్ణువక్షస్స్థలంబును విమలాపగా జలంబునుంబోలి పద్మాలంకృతంబై నీతివిహార యోగ్యంబయ్యు ననీతి విహారయోగ్యంబై ఖండ నవక్రమంబులు శాస్త్రంబుల యందు శూన్యగృహంబులు చతురంగ ఫలకంబుల యందు కార్శ్యంబులు కామినీమధ్యంబుల యందుకాని తనయందు మెరయనీక యొప్పు నప్పురంబున కధీశ్వరుండు. 53

సీ. శ్రీసతి సీమంత ♦ సిందూర వేదిక
కపటారి కాసార ♦ గంధకరటి
గంభీరగుణ కథా ♦ కలశ పాథోరాశి
సాతత్య సత్య వి ♦ శ్రమణ సీమ
సకల బాంధవ కలా ♦ పి కలాప నీరదం
బుదితాఘ ధరణి బృ ♦ ద్భిదురపాణి
నిజకీర్తివల్లరీ ♦ నీరంధ్ర దిగ్వీధి
కవికుటుంబ త్రాణ ♦ కల్పశాఖ

గీ. సజ్జనానూన కరుణా ర ♦ స ప్రవర్తి
భూజనాత్యంత సంస్తుత్య ♦ పుణ్యమూర్తి
కామినీలోక హృద్వశీ ♦ కరణ పుష్ప
ధన్వుఁడన నొప్పు నా హేమ ♦ ధన్వ నృపతి. 54

మ. అతఁ డుత్తుంగ తురంగ ధాటి రభసుం ♦ డై విద్విషన్మండలీ
నత పాదాంబుజుఁడై యయాతి రఘు మాం ♦ ధాతృ ప్రభావప్రభా
న్వితుఁడై తాల్చె నశేషభూభరము కం ♦ ఠే కాలకంఠ స్థల
స్థితి సంభావిత సంభ్రమ భ్రమితుఁడై ♦ శేషాహి చెల్లాడఁగన్. 55

క. కనికరము మోడ్చు పగరం
గనికరమునఁ బ్రోచు లేక ♦ కలహించెద నే

సని లోనఁ జలము ఫ్రానిన
సనిలో నిజకోపవహ్ని ♦ కాహుతిచేయుచ్. 56

సీ. కనుపారఁగాఁ బచ్చి ♦ కలు మేసి తముఁ దామె
యావ్రలుచేసి చ ♦ న్నవసి పితుకుఁ
దతికాల మొక్కింత ♦ తప్పనీక మొగుళ్ళు
నెల మూఁడు వానల ♦ నెలఖఁ గురియుఁ
బెరిఁగి వట్టంబులై ♦ బీడువోక తనర్చి
సకల సస్యములు సు ♦ స్నకయె పండు
దలపూపు వాడక ♦ తామరతంపరై
ప్రజలు నూతేండ్లును ♦ బరిణమింత్రు

గీ. మునులు తపములు నిర్విఘ్న ♦ ముగఁ జెలంగ
నెందుఁ గలిదోష మావంత ♦ జెందనీక
క్రతుఫలంబుల సురల యా ♦ కండ్లు దీర్చి
దరణిఁ బాలించె నా హేమ ♦ ధన్వ నృపతి. 57

క. ఈలీల సకల ధాత్రీ
పాలన మొనరింపుచును వి ♦ భావసు తినయుం
బాలిక యను బాలిక కుల
పాలికగా వతఁడు సౌఖ్య ♦ పరతంత్రుండై. 58

గీ. పెద్దకాలంబు నడపిన ♦ పిదపఁ దనకు
బుత్త్రలాభంబు లేమికిఁ ♦ బొగిలి పొగిలి
యొక్కనాఁడు మనంబున ♦ నోర్వలేక
పలికె నారాజు పాలికా ♦ లలనఁ జూచి. 59

చ మలయజగంధి యీాకరి స ♦ మాజము నీహయపంక్తి యీాభటా
వలియును గల్గి నాబ్రతుకు ♦ వన్నెకునెక్కదు పుత్త్రహీనతన్
గలువలవిందు పొందువెలి ♦ గా నుడుపంక్తులు మింట మిన్కనన్
బొలుపరి యున్నరాత్రి గతిఁ ♦ బూర్వకృతంబది మెట్టిదో గదా. 60

ఉ. మచ్చికతోడఁ బాలులు కు ♦ మారుని నక్కునఁజేర్చి వీధికిన్
వచ్చిసుఖోపలాలనము ♦ నన్ మునుమాపులు ముద్దుసేయఁగా
నిచ్చలు నిచ్చలుంగని యె ♦ కించుక యేనియుఁ బాయ వేకటుల్
ముచ్చటదీఱ నింకమన ♦ ముం గయికొందుమె యట్టి భాగ్యముల్.

సీ. లోచనానంద క ♦ ల్లోలినీ భర్తకుఁ
దోయజారాతి పు ♦ త్తెంచెఁ గాఁడె
శ్రవణహితాలాప ♦ రత్నాంకురాళికి
రోహణాచలము పు ♦ త్త్రెంచెఁ గాఁడె
యమిత పాతక పుంజ♦ తిమిర మండలికి న
ఖండదీపంబు పు ♦ త్తెంచెఁగాఁడె
సంసార సుఖమహీ ♦ జాతసంఘమునకు
దోహదసేవ పు ♦ త్తెంచెఁ గాఁడె

గీ. దుఃఖములఁబాసి ముక్తికిఁ ♦ ద్రోవచూపి
ప్రోవఁజాలినవాఁడు పు ♦ త్తెంచెఁ గాఁడె
కాన నిహపర సాధన ♦ కారణంబు
తల్లిదండ్రుల కాత్మీయ ♦ తనయుఁ డబల. 62

ఉ. చందురువంటి నెమ్మొగము ♦ చక్కటిఁ దూలఁగఁ బుట్టు వెండ్రుకల్
గెందలి రాకుఁబాదములఁ ♦ గీల్కొన జేసిన యట్టిచిన్ని పై
డందెలు గల్లు గల్లుమన ♦ నాడుచు నల్లన చేరవచ్చి నా
ముందఱ నాడ నెన్నఁడొకొ♦ముద్దియ ముద్దుఁ గుమారుఁ గాంచుటల్.

గీ. తోయజానన యొకబుద్ధి ♦ తోఁచె నాకు
నాదికారణ మీశ్వరుం ♦ డఖిలమునకుఁ
గాన నద్దేవ దేవుని ♦ కరుణ లేక
యీప్సితార్థంబు లేరికి ♦ నేల కలుగు. 64

గీ. నీలకంఠుని శిరసుపై ♦ నీళ్ళుచల్లి
పత్త్రి రిసుమంత నెవ్వఁడు ♦ పాలవైచుః

గామధేనువువానింటి ♦ గాడి పసర
మల్లసురశాఖి వానింటి ♦ మల్లెచెట్టు. 65

సీ. నవరత్న మయభూష ♦ ణములుదాల్చినవారు
సింహాసనస్థులై ♦ చెలఁగువారు
పరతత్త్వవాసనా ♦ పరతగాంచినవారు
నిఖిలవిద్యాప్రౌఢి ♦ నెరయువారు
చిరకాలజీవులై ♦ క్షేమమొందెడువారు
వితరణ విఖ్యాతి ♦ వెలయువారు
బంధుమిత్రస్ఫూర్తిఁ ♦ బాయకుండెడువారు
బహుపుత్త్రలాభంబుఁ ♦ బడయువారు

గీ. చక్కదనమున వన్నెకు ♦ నెక్కువారు
తొంటి మేనుల సద్భక్తి ♦ తొంగలింప
కాశికానాథుఁ గామారిఁ ♦ గాలకంఠు
పూజచేసిన వారె పో ♦ పువ్వుబోఁడి. 66

సీ. కడలేని సంసార ♦ జడధిలో మునిఁగిన
జనులపాలిటి నావ ♦ శంభుసేవ
కడు దూరమైయున్న ♦ కైవల్య సీమకుఁ
జక్కని పెనుద్రోవ ♦ శంభుసేవ
యతిభోగ భాగ్యంబు ♦ లను ముత్తియంబుల
సరులఁగూర్చిన కోవ ♦ శంభుసేవ
సకలాగమ జ్ఞాన ♦ సారమహీజాత
జాతంబులో చేవ ♦ శంభుసేవ

గీ. నిరవధికఘోర పాతక ♦ దురవ గాహ
గహన దహన సమున్నిద్ర ♦ గంధవాహ
సఖశిఖా మాలికలతేవ ♦ శంభుసేవ
(సద్గుణ లతాంతముల తీవ ♦ శంభుసేవ.) 67

క. కావున మనమద్దేవుని
భావంబున నిలిపి సుతుని ♦ బడయుద మనుచున్
దేవియును దాను భూపతి
కేవలతరశైవ మార్గ ♦ కృతనిశ్చయుఁడై. 68

క హాటకశైల ధనుర్ధరుఁ
బాటింపని వాఁడు నాకుఁ ♦ బగవాఁ డనుచున్
గూట పరి పంథిగర్వో
చ్చాటన గుణశాలి యతఁడు ♦ చాటం బంచెన్. 69

ఉ. ఎచ్చటఁజూచినం బ్రమథ ♦ హిండిత చండనిశాత వర్తనం
బెచ్చటఁ జూచినన్ గుహ గ ♦ ణేశ్వర భవ్యగుణాను వాదనం
బెచ్చటఁ జూచినన్ శివ స ♦ మీాహిత పుణ్యకథాను కీర్తనం
బచ్చుపడంగఁజేసె నతఁ ♦ డాదిమశైవకు లాగ్రగణ్యుఁడై. 70

శా. చూడం జిత్రము పత్రపుష్పముల కం ♦ చుం జేరనేతెంచి పెం
ప్రోడల్ శైవ కథారహస్యములకై ♦ పోరాడుచుం బోవుచోఁ
గూడ న్వచ్చి తదీయ వాదముల చి ♦క్కుల్దీర్చుఁ బో పట్టణ
క్రీడాకానన వీథికాగ్ర శుకశా ♦ రీ కిన్నర ద్వంద్వముల్. 71

శా. కించిన్మర్దళ నృత్యగీత సరస ♦ క్రీడావిధంబుల్ శుకీ
చంచూ చంచదనూన రత్నఖచిత ♦ స్తంభంబు లభ్రంకషో
దంచద్గోపుర పంక్తులు న్మెఱయు ♦ నుద్యద్భక్తి నూరూరఁ గ
ట్టించెన్ భూపతి దేవతానిలయ కో ♦ టిన్ జాహ్నవీ జూటికిన్. 72

సీ చంద్రకాంతోపల ♦ స్వచ్ఛవేదీ స్థలుల్
కస్తురి జవ్వాదిచేఁ ♦ గలయనలికి
యనవుగాఁ గ్రొత్త క ♦ ట్టాణి ముత్తియముల
నిగ్గులు వెదచల్ల ♦ ముగ్గువెట్టి
యర్ఘ్యోదకంబుల ♦ నభిషేక మొనరించి
రమణీయ రత్నపీ ♦ ఠమున నునిచి

మృగమద పంకంబు ♦ మేన నిండ నలంది
మేలేర్చి క్రొవ్విరుల్ ♦ గీలుకొలిపి
గీ ధూపమర్పించి కర్పూర ♦ దీప మొసఁగి
యమృత దివ్యాన్న రుచికోప ♦ హారమిచ్చి
వనితయును దాను సాష్టాంగ ♦ వినతిఁ జేసి
చంద్రధరుఁ గొల్చు నా రాజ ♦ చంద్రుఁ డెపుడు. 73

శా. రాజచ్చంద్రశిలా తలాంతరల తా ♦ రమ్య ప్రదేశంబులన్
గాజుం గుప్పెలలోని యచ్ఛతర గం♦ గావారి నోలార్చి యా
రాజుం దేవియు మంత్రపూతముగ నే ♦ రాశంపుఁ బూగుత్తులన్
బూజల్ సేయుదు రిచ్చలం జెలఁగి ము ♦ ప్పూటం బురారాతికిన్. 74

క. సంతాన కాంక్ష నాశ్రిత
చింతామణి సకలలోక ♦ సేవితుఁ గరుణా
స్వాంతుని రాజతశైల ని
శాంతుని భజియింతు రెపుడు ♦ సతియున్ బతియున్. 75

క. ఆ మానవపతి చిత్తా
రామములో నుండమరగి ♦ రాజతభూ భృ
త్సీమకయి పోఁదలంపక
సోమకళాధరుఁడు మిగుల ♦ సోమరియయ్యెన్. 76

వ ఇవ్విధంబున బరమ శైవాచార సంపన్నులగు దంపతు లప్పరమేశ్వ
రుని సేవింప నొక్కనాఁడు. 77

చ. కలగని యమ్మహీవిభుఁడు ♦ గ్రక్కునలేచి నిజంబుగా మదిన్
దలఁపుచు మేను గర్పొడవ ♦ నల్లడలుం బఱికించి యోకృపా
జలనిధి యోమునీంద్రవర ♦ సంస్తుత యోజగదేకనాథ నిన్
గల గనుగొంటిఁ దొంటి కలి ♦ కల్మషజాలము వీడుకొంటి నే. 78

మ. అని యంతంతకు నమ్మహామహిమ క ♦ త్యాశ్చర్యము బొంది య
జ్జనవాథాగ్రణి పాహిపాహియనుచున్ ♦ సంతానదానక్రియా

జాతకంబైన ఫలంబు మౌళి నిడి వ ♦ తుః పీఠిపైఁ దార్చి లో
చన యుష్ణాంబువుఁ జేర్చుచుం బొగడుచున్ ♦ సంతోషిత స్వాంతుఁడై.

ఉ. పాలిక మేలుకొల్పి నర ♦ పాల శిఖామణి వింటివే విసీ
లాలక నిన్ను రేయి వెదక ♦ మహేశ్వరు నాశ్రితపారిజాత మ
బ్బాల శశాంకమౌళి మన ♦ పాలిటి కొంగు పసిండి మందమం
దాలస లీల వచ్చె దర ♦ హాస వికాసి ముఖారవిందుఁడై. 80

క. వచ్చి భవ ద్భక్తికి నే
మెచ్చితి నీఫలము నీ స ♦ మీహిత మొసఁగెన్
బుచ్చుకొను మనుచుఁ జేతికి
నిచ్చి భవానీసమేతుఁ డరిగె ♦ నే లలితాంగీ 81

క. అని పలికి యభవుఁడిచ్చిన
యనర్ఘ్యఫలము విభుఁడిచ్చె ♦ నాత్మాంగన కెం
దును శివభక్తులకును గలఁ
గనిన ఫలంబెన్న నిజము ♦ నాఁజేకుఱుఁగా. 82

ఉ. ఇచ్చిన ప్రముక్కి పుచ్చుకొని ♦ యింపును సొంపును బల్లవింపఁగా
నచ్చపలాయతేక్షణ శి ♦ వార్పణమంచు సుధారసంబుతో
ముచ్చరికింపఁజాలు రుచి ♦ మత్ఫల మాదట నారగించి వా
క్రుచ్చఁగరాని మోదమున ♦ కున్నతవై పెనుపొందె నంతటన్.

సీ. చూపుఁ దేటుల పిల్ల ♦ లూపాడఁజొచ్చెఁబో
యాడక యవియేల ♦ యడఁగియుండుఁ
జనుఁగవ జక్కవల్ ♦ పెనుపొంది యుబ్బెఁబో
యుబ్బక యవియేల ♦ యూరకుండు
వేణికానీలాహి ♦ విస్ఫూర్తి మించెఁబో
మించక యదియేల ♦ మిన్నకుండు
చిఱునవ్వు మొలకలు ♦ చిగురొత్తఁ దలఁచెఁబో
తలఁపక యవియేల ♦ నలఁగియుండు

గీ. వనఁగ నొకకొత్త చెల్వమ ♦ య్యంబుజాత
గంధి కెంతేని గర్భిణ ♦ కిక్కసక శైల
కార్ముకానూన కరుణా వి ♦ కాసలబ్ధ
ఫల రసామృత ధారల ♦ ల్పులె తలఁప. 84

క. ఈరీతి నమ్మృగేక్షణ
యారూఢ మనోనురాగ ♦ యై యుండు తఱిన్
మేరుమహీధర కార్ముక
కారుణ్యము కతనఁగొన్ని ♦ ఘస్రంబులకున్. 85

సీ. కౌను దొడ్డతనంబుఁ ♦ గని చింతపడుగతిఁ
గుచముఖంబులు నీల ♦ రుచివహించె
మందస్మితంబున ♦ మరగి రాదన మొద్దుఁ
బలుచని చెక్కులు ♦ పలకఁబాఱె
ఫలరసంబుల కెవ్వి ♦ ప్రతిరామి నొల్లదో
యన జిహ్వకన్నిట ♦ నరుచిపుట్టె
గర్భస్థుఁడగు బాలు ♦ కమనీయ గుణభార
మహిమ నా నడలతి ♦ మందమయ్యెఁ

గీ. గలికి బేడిస మీలతోఁ ♦ గలహమాడు
వాలుఁ జూపుల దాటులు ♦ డీలుపడియె
మంటి కమ్మని తాలిపై ♦ మనసు పాఱె
నాఁడు నాటికి బాలి కా ♦ నలిన ముఖికి. 86

వ. అట్లు గర్భ భరాలసయైన యయ్యంగనకుం బుంసవనాది కృత్యంబులు నిర్వర్తించిన యనంతరంబున నవమా సావసానంబగుటయు శుభ ముహూర్తంబునఁ గుమారుండు దయించిన 87

మ. కురిసెం బువ్వులవాన చూపరుల చూ ♦ డ్కుల్ వేడ్కనోలాడఁగా
నెరసెన్ మెల్లని చల్లగాలి కొదమల్ ♦ నెత్తావి నిండారఁగాఁ
బొరసెన్ దిక్కులు నొక్కవింత చెలువం ♦ బున్ దత్కుమార ప్రతా
ప రుచింబోల మినాఁ బ్రశాంతగతి సం ♦ ప్రాప్తించె వైశ్వానరున్.

ఉ. అప్పుడు బంధుమిత్ర సహి ♦ వా స్వోత్సుకుఁడై మహనీయ వైభవం
బుప్పతిలన్ ధరామర స ♦ ముత్కరముం బిలిపించి యిచ్చెఁ బో
తెప్పలుగాఁ గరుల్ హయములు - ధేనువు లంబరముల్ మణివ్రజం
బప్పతి యుప్పతిం దెగడు ♦ నట్టి సమున్నత దానవైఖరిన్. 89

మ. నరనాథోత్తముఁ డీగతిన్ వివిధ దా ♦ న పౌరోధిఁ బుత్రోత్సవ
స్ఫురణంబొప్ప ఘటించి సూతక దినం ♦ బుల్ వుచ్చి దాక్షాయణీ
వరకారుణ్య విశేష బంధుఁడగుటల్ ♦ వర్ణింపుచున్ రాజశే
ఖర నామం బొనరించెఁ బుత్రకునకుం ♦ గౌతూహలాయత్తుఁడై. 90

శా. వైరించ ప్రీతి భావ దావద వచో ♦ వైయాత్య సాతత్య స
త్త్వారూఢ స్థితి పాండవాగ్రజ మహీ ♦ య స్వచ్ఛ కీర్తిచ్ఛటా
పారావారనిమగ్న శత్రుగణ శుం ♦ భత్పూర్వ భూభృద్దిశా
నాకీ మన్మథ బంధురక్షణ చణా ♦ నాదెండ్ల వంశాగ్రణీ. 91

క. చతుర తర వచన రచనా
చతురానన త్రిచతురాశ్వ ♦ సప్తిజ వానీ
చతురంగ ఖుర రజోవిక
చతురా పాణ్నయన కమల ♦ సము దగ్ర బలా. 92

మాలిని. హరి చరణ పయోజ ♦ ధ్యాన సంధాన మార్గా
స్థిరమతి గుణధారా ♦ శిక్షితాఘ ప్రచారా
సుర సురభి వితీర్ణ ♦ స్తోత్ర పాత్ర ప్రకారా
గిరిచర దరివీరా ♦ కృష్ణమాంబా కుమారా. 93

గద్య.

ఇది శ్రీమదఘోర శివాచార్య గురుకరుణా విశేషలబ్ధ సారస్వత
మాదయామాత్యపుత్ర మల్లయ నామధేయ ప్రణీతంబైన
రాజశేఖర చరిత్రంబను మహాప్రబంధంబునందుఁ
బ్రథమాశ్వాసము.

శ్రీరస్తు.

# రాజశేఖరచరిత్రము.

---

(మాదయగారి మల్లన్న ప్రణీతము.)

## ద్వితీయాశ్వాసము.

---

శ్రీరమణీ మనీయ వి
హారాయతనూత్న లోచ ♦ నాంభోజయుగా
దోరమిత కీర్తినిరసిత
తారక భృత్కాశ యప్ప ♦ దండాధీశా. 1

వ. అవధరింపు మిత్తెఱంగున నావర్తిత నామకరణాది సంస్కారుండై ప్రతిదిన ప్రవర్ధమానుండగుచు నక్కుమారుండు. 2

ఉ. సిద్ధపురత్నభిత్తిఁ దన ♦ నీడఁగనుంగొని తోడనాడు న
మ్ముద్దులబాలుఁడంచుఁ గర ♦ ముల్ పలుమాఱును జాఁచి చీరుచున్
విద్దెముచేయుచుం దిరుగు ♦ విందులు విందులు విందులంచు నే
పొద్దు నృపాలుఁడున్ సతియుఁ ♦ బొంగుచు నక్కున గారవింపఁగన్

శా. కేలీకాంచన సౌధవీధికల చ ♦ క్కిందొట్లలోఁ బెట్టియో
ప్రాలేయాచల కన్యకాధవ కృపా ♦ పారంగతా నిద్రపో
వే లావణ్య పయోనిధీ యనుచు నా ♦ విఖ్యాత మోదంబునన్
జోలల్ పాడుదు రక్కుమారకునకున్ ♦ శుద్ధాంతకాంతామణుల్. 4

క. అల్లారు బెల్లమై గలు
గల్లున నందియలు మొరయఁ ♦ గా వేడుక పె
న్వల్లి మునిఁగించె ధరణీ
వల్లభ నందనుఁడు చూచు ♦ వారల చూడ్కుల్. 5

గీ. కలికిఁ జూపుల మూడవ ♦ కన్ననంగ
రత్నములు గీలుకొల్పిన ♦ రావిరేక
ఫాలభాగంబునను గ్రాల ♦ బాలుఁడపుడు
శంబరారాతి యభియాతి ♦ చందమయ్యె. 6

మ. వనితానేత్రచకోర చంద్రిక తను ♦ స్వచ్ఛందకాంతిచ్ఛటా
ఖని యుత్సాహకళాఖర్వారి షట్కే ♦ ఖా మంత్రి సంసిద్ధి భో
గ నివాసంబు లతాంతసాయక భుజా ♦ గర్వావలంబంబు యౌ
వన మమ్మానవనాథ పుత్త్రునకు మ ♦ వ్వంబొప్ప నేతెంచినన్, 7

సీ. ధర మొక్క మైఁజాల్పఁ ♦ దరముగాదని భోగి
వరుఁడుదాల్చిన తను ♦ ద్వయమనంగ
హృదయ గేహముఁ బాసి ♦ యీశుఁడేగకయుండ
నలవరించిన బోరుఁ ♦ దలుపనంగ
సముదీర్ణలావణ్య ♦ జలధి కోఁజూపట్టు
లాలితశైవాల ♦ లత యనంగ
నిందిర విహరింప ♦ నెడముగా నజుఁడు గా
వించిన క్రొందమ్మి ♦ విరులనంగ

గీ. నిడుదబాహుయుగంబును ♦ వెడదయురముఁ
గొమరు మీసలు దీర్ఘ నే ♦ త్రములు మెఱయ
మానినీ జన మానస ♦ మానహరణ
చతురతరమూర్తి యారాజ ♦ సుతుఁడు మెఱసె, 8

ఉ. ఏయు నిశాతబాణముల ♦ హేళిఁ బడింబడి సూక్ష్మ లక్ష్యముల్
ద్రోయు సుతప్రఘూర్ణమునఁ ♦ దుంగధరాధరశృంగ సంఘముల్
వ్రేయు భుజాకృపాణి నవ ♦ లీల నయోమయ పిండ ఖండముల్
ప్రాయము పెక్కువన్ ధరణి ♦ పాల తనూజుఁడు సత్త్వయుక్తుఁడై.

గీ. ఇత్తెఱంగున యౌవనా ♦ యత్తుఁడగుచుఁ
దండ్రియానతి యొక్కింత ♦ తప్పవెఱచి

యౌవరాజ్యాభిషిక్తుఁడై ♦ యతిశయిల్లె
నఖిల విద్యానిరూఢిఁ బెం ♦ పొంది యతఁడు. 10

ఉ. రామునికంటె నప్పరసు ♦ రామునికంటె ధనుర్విశేష వి
ద్యామహనీయుఁడై మెఱసి ♦ యాతఁడు చేతుల తీటవో సము
ద్దామ విరోధి బాహుజ వి ♦ తానము నుక్కడఁగించి వీర ల
క్ష్మీ మదిరాక్షికిన్ వలపు ♦ గీల్కొలిపెన్ విషమాస్త్ర కేళికిన్.

సీ. కలశాభోజన ముని ♦ గ్రామణి యాకంట
నానాఁటి నిటమీఁద ♦ నవయకున్న
దళితారి రక్తాప ♦ గలు నిండి పాఱమి
వారిధు లిటమీఁద ♦ నడియకున్న
నిజమండలోద్బాధ ♦ నిర్వేదములు మాని
నలినాప్తుఁ డిటమీఁదఁ ♦ జెలఁగకున్న
రంభా నిరంతర ♦ రతికేళిఁ బౌలస్త్య
నందనుం డిటమీఁదఁ ♦ బొందకున్న

గీ. యనఘ దర్పిత పరిపంథి ♦ మనుజ పతుల
బీరములుమాన్పి తనపాద ♦ పీఠిఁ జేరి
కప్పములువెట్టి కొలువ ని ♦ ష్కంటకముగ
ధాత్రిపాలించె భువనైక ♦ జైత్రుఁడగుచు. 12

వ. ఇవ్విధంబున, బ్రజాపాలనంబు చేయుచుండునంత నొక్కనాఁడు హే
మధన్వ మహీపాలుండు పేరోలగంబుండు సమయంబున. 13

చ. కనుఁగవ నిప్పుకల్ చెదరఁ ♦ గా నదరుల్ వెదచల్లు కెంజడల్
పెనఁగొన నక్షహారములు ♦ బిట్టుగ నిట్టటు లూఁగ నెంతయున్
గినుకవహించి యొక్కముని ♦ కేసరిగొబ్బునఁ జేరవచ్చె న
జ్జన పతియున్ సభాసదులు ♦ సాధ్వసమంది వడంకునట్లుగన్, 14

గీ. అమ్మహామౌనివచ్చిన ♦ యాగ్రహంబు
కెందమవియింప గద్దియ ♦ డిగ్గి మ్రొక్క—

వినయ వినమితుఁడై యున్న ♦ విభుని జూచి
లెక్కసేయక పలికె న ♦ మ్మౌక్కపునఁగ. 15

క. కాచము రత్నము సరిగాఁ
జూచు మహామహుల తపము ♦ చూఱలఁబోనీ
వేచింతయు మదిఁబెట్టవు
రాచఱికం బింతచెఱుతు ♦ రా నరనాథా! 16

ఉ. ముంపిరి రాజ్యగర్వమున ♦ ముందరగానవు గాక ధాత్రిఁ బా
లింపరొ తొంటిరాజులు ది ♦ లీపముఖుల్ మునికోటి కూఁత లా
లింపరొ నొంపరో మద వి ♦ లిప్త కఠోర నిశాటఘాటమున్
నింపరొ దిక్కటాహముల ♦ నిర్మల కీర్తి సుధాంశుచంద్రికల్. 17

క. ఘాతుక దైతేయ కశా
ఘాతములకు మౌనివరుల ♦ కాయములకు యీ
పాతకము కలిగె ధాత్రికి
నీతరమున నిట్లుచెల్లు ♦ నే మము వదలన్. 18

ఉ. పుండ్రకనామధేయమున ♦ భూరిభుజాల బలశాలియైన మీ
తండ్రి కవింజర ప్రభుతి ♦ తాపస ముఖ్యుల యజ్ఞవేళ పె
క్కండ్ర నిశాటులం దఱిమి ♦ కౌశికదైత్యుని నుక్కడంచె నా
తీండ్ర మొకించు కేని వల ♦ దే కలదే మఱిదిక్కు ధాత్రికిన్. 19

సీ. పరమండలోద్భేద ♦ పదములాలోకించి
మంత్రరక్షణకళా ♦ మహిఁదాల్చి
ద్వీపాంతరంబుల ♦ తెఱఁగు లాకర్ణించి
గడినున్న మన్నీల ♦ క్రమ మెఱింగి
దుర్గాధిపతుల సు ♦ ద్దులు విచారముచేసి
బలముల నప్పట ♦ ప్పటికిఁ జూచి
నిజరాజధానిలో ♦ ని విశేషముల్గని
మంత్రి సామంతుల ♦ మతము లరసి

గీ. పేదసాదుల విన్నపం ♦ బాదరించి
ప్రతులమైనట్టి మనుబోటి ♦ వారి సరసి
రాజ్యకేళినఁ దగుఁగాక ♦ ప్రాజ్యవైభ
వంబు గలదని సుఖయించు ♦ వాఁడు నృపుఁడె. 20

సీ. నెమ్మని తిమిరంబు ♦ నేత్రగోళంబుల
పర కర్ణపుటముల ♦ ప్రత్తినోరి
వాక్కట్టుమందు గ ♦ ర్వ లతాలవాలంబు
వినయకృత్యంబుల ♦ వేరువిత్తు
కరుణారసంబు తె ♦ క్కలికాఁడు మదిచొక్క
పాతకంబులపాలి ♦ పట్టుగొమ్మ
మొగమోట కుడుగని ♦ పగ రాజసంబుల
యిక్కువ గురుసేవ ♦ కెదురుచుక్క
గీ. పరుష వర్తన కునికి లో ♦ భంబు టెంకి
బాంధవస్నేహ సిందూర ♦ పాలకంబు
కలశపాథోధిపుత్రి క్రేఁ ♦ గంటి చూడ్కి
కాని రాజుల నేరమె ♦ కాదు సువ్వె. 21
క. అన విని శివ శివయని యు
జ్జనపతి వెఱఁగంది యపుడు ♦ సవినయముగ న
మ్మునివరు విహితాసనమున
నునిచి ప్రియం బొదవఁగా మృ ♦ దూక్తులఁ బలికెన్. 22
క. వెఱ పొక యింతయు లేకీ
తెఱఁగున మిము నెవ్వఁడింత ♦ తెగి చేసెనొకో
యొఱఁ గెఱఁగి యుండి యకటా
కొఱవిం దలఁగోఁకు కొనుట ♦ కుం దలపెట్టెన్. 23
గీ. వికటదైత్యులు నాపేరు ♦ విన్నయంత
జలదరించుచు వలయాద్రి ♦ చఱులఁగాని
మొదుఁ దలచూప వెఱతు రిం ♦ కేమిచెప్ప
నింత కాలంబునకు నొక ♦ వింత గంటి. 24

క. కినుక మెయి నిపుడు మిమ్ముం
గనుగొన కలంచి నట్టి ♦ గర్వాంధునిఁ దు
త్తునియలు గావించెద నే
ననఘా వినిపింపు మనిన ♦ నతఁ డిట్లనియెన్. 25

ఉ. ఏమని చెప్పవాఁడ ధర ♦ ణీశ్వర యే వరతంతు సంయమి
గ్రామణి శిష్యుఁడన్ జటిల ♦ కౌశికుఁ డన్ బహువేదశాస్త్ర వి
ద్యామహనీయుఁడన్ బదరి ♦ కాశ్రమ వాసుఁడఁ బుత్రికామణిన్
గోమలపాణి భానుమతిఁ ♦ గోల్పడి వచ్చినవాఁడ నక్కటా. 26

ఉ. నీకరుణా విశేషమున ♦ నెమ్మది నేమి కొఱంతలేక య
స్తోక తపో విధానములు ♦ పూఁటలు పట్టి సమస్త తాపసా
నీకము నేఁటిదాఁక నతి ♦ నిశ్చలతన్ వసియించె నిప్పడ
స్వీకృత నిత్యకర్మమయి ♦ చిక్కె విశంకట దైత్య బాధలన్. 27

సీ. వినవయ్య ధరణీశ ♦ విరివియై కన్పట్టుఁ
గొండచేరువ నొక్క ♦ కోనగలదు
బెడఁగైన యక్కోన ♦ నడుచక్కి మిక్కిలి
భీకరంబగు నొక్క ♦ బిలముగలదు
తలఁకింతయును లేక త ♦ ద్బిలద్వారంబు
సరణిఁబో నొక రక్త ♦ సరసి గలదు
ఘోరతరంబైన ♦ యారక్త సరసి వెం
బడిఁ బోవ నటనొక్క ♦ బయలు గలదు

గీ. పరభయంకర మందొక్క ♦ పురముగలదు
తత్పురంబుననుండి సం ♦ తతమువచ్చి
యాత్మతరుణి కూడిగము చే ♦ యంగవలసి
పొంచి నవరల పాపలఁ ♦ గొంచుపోవు. 28

శా. కాళీదత్త కఠోరలోహమయ కం ♦ ఖాణంబుపైనెక్కి దం
భోళిక్రూరకరాసిఁ ద్రిప్పుచు గళో ♦ ద్భాసచ్ఛటా కారముల్

గ్రాలఁగ గోత్ర ధరాధ రేంద్రములు ప్రీ ♦ లన్ లీనమై వేడెపుల్
దోలఁగ ధేయని యక్షకిన్నర పుర ♦ స్తోమంబు దూటాడఁగన్. 29

సీ. ఒకవేళ సింహమై ♦ యుఱుకుచు బెదరించు
నొకవేళహరిణమై ♦ యొద్దనిలుచు
నొకవేళ భూజముల్ ♦ పెకలించు ఘోణియై
యొకవేళ శలభమై ♦ యుద్భవిల్లు
నొకవేళ మాసరమై ♦ యొయ్య నొయ్యన వచ్చు
నొకవేళ నగ్నియై ♦ యుఱక వెలుఁగు
నొకవేళ మేఘమై ♦ యుఱుముచు నేతెంచు
నొకవేళ శైలమై ♦ యుండునడుమ

గీ. సద్గురాత్మునిమాయ లే ♦ మనఁగఁగలదు
జప తపోనిష్ఠలేమియు ♦ జరుగనీక
బదరికాశ్రమసీమ తా ♦ పసులనెల్ల
నలఁచి యేచుచు నొక్కనాఁ ♦ డదనువేచి. 30

క. నాచిన్ని ముద్దుకూఁతురు
నాచక్కనితల్లి వీధి ♦ నడయాడఁగ న
న్నీచుకొనిపోయె సాళ్వము
రాచిలుకంగొంచు బోవు ♦ క్రమమునఁ దంద్రీ. 31

క. ఆసవ రయ్యెయ్యన నెఱిఁగి మ
హాసుర వెనువెంటఁబోవ ♦ నదలించి గత
త్రాసుఁడయి చేతి కళగొని
వేసెనినను నిట్లు రోష ♦ వివశుం డగుచున్. 32

క. ఏడవ యేటిది యెవ్వరు
వేడుక కదలించిరేని ♦ వెక్కుచు నేడ్చున్
జూడభయంకరయగు తన
చేడియ కుడిగంబులెట్లు ♦ చేయునృపాలా. 33

క. అత్తి దయామతిఁ దనకడ
నత్తమిలక నిద్రవోవ ♦ దహరహమునున్
బొత్తునఁ గుడువక తాఁగడి
యెత్తదు తజ్జనని యింత ♦ కేమయ్యెనొకో. 34

సీ. కడుపార దొండపం ♦ డిడి ముద్దుగఱపిన
రాచిల్క కొదమలఁ ♦ జూచి చూచి
పాదులలో నిండ బా ♦ ల్పోసి పెంచిన
మాతపోతంబులఁ ♦ జూచి చూచి
తోడికన్నెలుఁ దాను ♦ గూడి మాడి చరించు
సురపొన్న నీడలఁ ♦ జూచి చూచి
బృందావనంబులు ♦ పెంచి తిన్నెల మీఁద
సూటిఁ బెట్టిన ముగ్గు ♦ చూచి చూచి

గీ. సంతసంబున దేవ పూ ♦ జలు ఘటించి
పారికాంక్షులసేవకై ♦ పరమ నియతి
లీల నడయాడుచున్న బా ♦ లికలఁ జూచి
హృదయవీథిక నెట్లు భ ♦ రించువాడ. 35

ఉ. ఇంకిట మాటలేమిటికి ♦ నింతకు నా తనయా లలామ మే
శాంక నిభాస్య యెదుఁబడి ♦ బొందెనొ యెంత గుందెనో
శంకర సత్కృపారస వ ♦ శంబున గాంచినయట్టి యీ నిరా
తంకునిఁ బంపి నామనసు ♦ తల్లడ మార్పఁగదే నృపాగ్రిణీ. 36

వ. అనియిట్లు పలుకుచున్న మునిపలుకుల కులికి నృపాలుండాత్మ
గతంబున. 37

ఉ. కానకగన్న పీనినెటు ♦ గాఁ గుటిలాసుర మీఁది కోటికిన్
గానన సీమ కంపు దటు ♦ గాక దురంత విషాద వేదనా
ధీనత యీ మహాత్మునకుఁ ♦ దీర్పక యేగతి నుండఁగాఁదగున్
దీనికి నెద్ది కార్యమని ♦ నివ్వెఱఁ గంద నతండు క్రిమ్మఱన్. 38

ఉ. మత్తవిరోధి వీరగుణ ♦ మర్దనశాలి కపర్ది సత్కృపా
దత్తుఁ డనూనధైర్య నిధి ♦ తావక పుత్త్రుఁడితండు నేఁడు చే
నెత్తురుగాకయుండ నతి ♦ నిష్ఠుర శాతకృపాణ ధారచే
దుత్తుము రాడి వచ్చు నల ♦ దుర్మదు నొండు దలంప కుండుమీ. 39

క. కావున నీరాజన్యుని
నావెనుకం బనుపు మనుడు ♦ నరపతి ధరణీ
దేవుని యప్పని వేగమ
కావింపఁగ వలసి సుతునిఁ ♦ గనుఁగొని పలికెన్. 40

మ. బలియుర్ మాయ లఘోరరాక్షస వరుల్ ♦ బాలుండ వీ వెన్నడున్
గలనన్ దైత్యులతోడఁ బోర వగజా ♦ కాంతుండు నీపాలికిం
గలఁ డచ్చుండ విశంకటాసురుని వే ఖండించి మాదీవనన్
దలపూవాడక పోయిరమ్మిపుడు పు ♦ త్త్రా వీరవంశాగ్రణీ. 41

చ. అనిన మహాప్రసాదమని ♦ యాత్మఁజెలంగి కుమార వర్యుఁడ
జ్జనపతిపంపునన్ సకల ♦ సైన్య సమేతముగా హుటాహుటిన్
మునిపతి చూపుచొప్పున స ♦ ముద్ధతమైఁ జని కాంచె ధాటికా
ఘనతరధూళి సంజనిత ♦ కందర జాలము మంధశైలమున్. 42

క. కనుఁగొని యజ్జననాథుఁడు
మునినాయక చూడు దూర ♦ మునఁ గనుపట్టెన్
వినువీధి బిట్టు రాయుచు
ననఘా యిదియే నగేంద్ర ♦ మన నతఁడనియెన్. 43

ఉ. అల్లది కంటివే నృపకు ♦ లాగ్రణి మంధ మహీధరంబు రా
గిల్లెఁ బ్రఫుల్ల కింశుక వి ♦ కీర్ణ రుచి చ్ఛవి పిక్కటిల్ల నీ
యుల్లసిత ప్రతాప దహ ♦ నోగ్ర శిఖావళి తానుమున్న య
బ్బల్లిదుఁడైన రక్కసుని ♦ పై నెలగోలున వచ్చెనో యనన్. 44

ఉ. విందును బోతె నో విమత ♦ వీరభయంకర రాజలోక సం
క్రందన నీవురా నెదురు ♦ రాఁ జనుదెంచె నిలింపకామినీ

బృంద లతాంతకాంత కబ ♦ రీ భర సౌరభ సార సన్నిభ
స్మందర కందరా సహిత ♦ మంథర బంధుర గంధవాహముల్. 45

క. ఇందుమణి మందిరాంగణ
మందార మరంద మత్త ♦ మధుకర నినదా
నందమునఁ బొంది నగరా
ణ్ణందనయుం దానుఁ బ్రేమథ ♦ నాథుఁడు మెలఁగున్ 46

సీ. వామదేవుని మౌళి ♦ వాడని క్రొవ్విరిఁ
బూజగావించిన ♦ పుణ్యుఁడీతఁడు
సకలా మరశ్రేణి ♦ సంప్రీతిఁ బొందంగ
దానమిచ్చిన మహా ♦ ధర్మి యితఁడు
తులసిఁగల్పించి మ ♦ ర్త్యులఁ బావనంబుగఁ
జేసిన యుపకార ♦ జీవి యితఁడు
(దేవర్షులకుఁ గామ ♦ ధేనువుఁ గలిగించి
తలఁపు లీడేర్చిన ♦ ధన్యుఁడీతఁడు)
గీ. పాఁప తరిద్రాటఁద్రెచ్చు ని ♦ ర్బంధమునకు
నోర్చితిప్పట నొందిన ♦ యుత్తముండు
ఇతఁడు సర్వప్రదానైక ♦ హేతువనుట
గలశవార్థికిఁ గల్పనా ♦ గౌరవంబు. 47

చ. అని కొనియాడి యామని వి ♦ హార మనోహరమైన యా నగం
బ్రునికడ నేఁడు నిల్చు మతి ♦ దూరముగాఁ జనుదెంచి సేనడ
స్సిన యది దైత్యులెంకియును ♦ జేరువ యిచ్చటి కర్కమండలం
బును దనుజ ప్రతాపగతిఁ ♦ బొల్పరి వారిధిఁగు్రింకఁ బొత్తెఱుఁగా.

వ. అని పలుకు నమ్మని పలుకులువిని యప్పుడమిఱేఁడు పడవాళ్ళం
బిలిచి సేనల విడియ నియోగించె నప్పుడు 49

సీ. గగన పాదోల్లేఖ ♦ గంధసింధుర ఘటా
ఘంటా ఘణాత్కార ♦ కఠిన రవము

తపనాశ్వ సుఖకర ♦ ధ్వజపట పల్లవ
స్ఖలిత రథావళి ♦ చక్రరవము
పటస పాణింధమ ♦ ప్రథితవేగవ్యగ్ర
సైంధవహేషా ప్ర ♦ చండ రవము
కటితటాస్ఫాల నో ♦ ద్భటవీరభట ఖేట
క వ్రాతసంఘాత ♦ గాఢరవము

గీ. నెఱసి కకుబంతసీమలు ♦ నిండినపుడు
చెదరిపాఱెడు మృగములు ♦ సదరిచదల
కుఱుకు సింగంపుఁ గోదమలు ♦ వెఱచిపఱచు
పక్షిజాతంబునై దైత్య ♦ భయదమయ్యె. 50

చ. ఔరసిన యమ్మహారవము ♦ పెల్లున కుల్లము దల్లడిల్లఁ ద
ద్వరిసరవర్తులైన వన ♦ పాలక దానవు లావిశంకటా
సురపతియున్న తద్బిలము ♦ సొచ్చి రయంబునఁ జేరఁబోయి యో
గురుభుజశాలి యోదనుజ ♦ కుంజర నేఁడొక క్రొత్త వింటివే. 51

ఉ. చివ్వకు నిన్ను మార్కొనఁగ ♦ జిష్ణునకైనఁ దరంబుగాదు వాఁ
డెవ్వఁడొకాని మమ్ము నొక ♦ యించుకయేని గణింపకెంతయుం
గ్రొవ్వునఁ గన్నుగానక య ♦ కుంఠితదోర్బల ముల్లసిల్లఁగా
గవ్వపుఁ గొండదండ మన ♦ కారడవిన్ విడియించె సేనలన్. 52

వ. అనినవిని యద్దనుజుండు క్రోధోద్రేక ఘూర్ణమాన మానసుండును వికట ఘటిత భ్రుకుటి నటన భయద ఫాల భాగుండును నక్షుదగ్రా గచ్ఛురిత దుర్నిరీక్షుండును నగుచు నిట్లనియె. 53

శా. ఓరోరీ కలగంటివో బ్రిమసితో ♦ యుగ్రాహి వాటోప దు
ర్వార ప్రక్రమ మా మకీన భుజగ ♦ ర్వంబెన్నరో కాకనా
పేరెవ్వారు నెఱుంగరో యకట ♦ నీ కీర్తిన్ నరుండెవ్వఁడే న
న్నేరవ్వచ్చునె నన్ను బెబ్బులి పయిన్ ♦ జింబోతు లంఘించునే. 54

ఉ. మంచిది యందుకేమి యని ♦ మంత్రుల మోములుచూచి నవ్వి న
క్తంచరభర్త యెల్లి మన ♦ దానవకోటికి భుక్తిగాఁగ మ
ట్టించెద వారిసేనలఁ గ ♦ డించి మగంటిమిఁ గాళికావరో
దంచితలోహసైంధవ ఘ ♦ నాగ్రములన్ లయకాలుఁ డైవడిన్. 55

వ. అనిన విని సచివ నికరం బిట్లనియె. 56

సీ. కాకోదరస్వామి ♦ కంఠనాళంబులు
పుడుకుదుమే యొక్క ♦ పూఁటలోన
సుత్రాముఁబట్టి యీ ♦ డ్చుక వచ్చియిట వ్రేలఁ
గట్టింతుమేయొక్క ♦ గడియలోనఁ
గులమహీధ్రముల ♦ నుగ్గులుగాఁగఁ బిడికిళ్ళఁ
బొడుతుమే యొక్కింత ♦ తడవులోనఁ
గూర్మాధిపుని వెన్ను ♦ గులగుల్లగాఁబట్టు
మట్టుదుమే మాట ♦ మాత్రలోన
గీ. ముజ్జగంబులు నొక్కట ♦ మొనసెనేని
మీఁటి నీదాఁక రానిత్తు ♦ మేనిశాచ
రేంద్ర నీసత్యమొగిని నీ ♦ వెఱుగవెందు
విన్ను మార్కొని మర్త్యులే ♦ నిలుచువారు. 57

క. అటుపలుకు మంత్రుల విశం
కట దనుజాధముఁడు చూచి ♦ ఘనులారా! మహో
ద్భట పరభటకోట్లన్ ద్రిం
గుటయుం ద్రుంచుటయు ♦ నేఁడు క్రొత్తలె మీకున్. 58

సీ. కాల్వురలెక్కక ♦ గ్గలముగాఁగొని యేగి
దీర్ఘాస్యుఁడెలగోలు ♦ దివియువాఁడు
చటులప్రభంజన ♦ జవతురంగంబులఁ
బ్రేతజిహ్వుండేర్చ ♦ రించువాఁడు
కదిసి దట్టంబుగా ♦ గంధసింధుర ఘటల్
భీమకేతుఁడు నడ ♦ పించువాఁడు

బిరుద ధ్వజాంకిత ♦ భీకర రథపంక్తి
ఘోరదంష్ట్రుఁడు పురి ♦ కొల్లువాఁడు

గీ. కపిలధూమ్రాక్షు ఘర్ఘర ♦ కామరూప
కుటిల బాహులు ముందరఁ ♦ గొలువవారు
గాఁగ మిన్నును నేలయుఁ ♦ గ్రక్కతిలఁగ
గాటమై యెల్లివానిపైఁ ♦ గదలవలయు. 59

క. అని నిశ్చయించి మంత్రుల
ననిచి వడిన్ లేచి కటము ♦ లదరఁగ నూర్పుల్
వెసఁగొన నిజసౌధమునకుఁ
జనియె నతండచట నస్త ♦ సమయం బగుటన్. 60

క. మెల్లన మెల్లన చీఁకటి
పిల్లలు చనుదెంచెఁ దొలుత ♦ బెదరి దిశలకున్
జెల్లాచెదరయి పోయిన
భల్లూకచయంబు వచ్చు ♦ పగిది ఘటింపన్ . 61

క. చరమగిరి సాంధ్యరాగ
స్ఫురిత చ్ఛవి చూడఁ జూడఁ ♦ బొలుపేద నిశా
చరనాథరాజ్యలక్ష్మీ
కురుకుచ పరిలిప్తమయిన ♦ కుంకుమ భంగిన్. 62

మ. జ్వలనజ్వాలిక లాత్మసన్నిహిత శ ♦ శ్వత్కాంతి సంరక్షకై
జలదుర్గస్థలి నిల్పి బర్వెడిఁ దమ ♦ స్సందోహముల్ వచ్చెనా
దళదాకీర్ణ పరాగ హల్లక సతాం ♦ తశ్శ్రేణికా సీమలన్
బొలయున్ ఝుంకృతి సింహనాద విచర ♦ త్పుష్పంధయ వ్రాతముల్.

గీ. అమ్మహాదైత్యు గెలుచుట ♦ కరుగుదెంచు
వీరుఁడెవ్వాఁడొ యనిచూచు ♦ వేడ్కఁ బెక్కు
గన్నులొక్కటఁ దాల్చెనో ♦ గగనలక్ష్మి
యనఁగ నల్గడఁ దారక ♦ లతిశయిల్లె. 64

గీ. అపుడు సాయంతనార్హ క్కృ ♦ త్యములు నెఱపి
యేకతంబున్న ధాత్రీత ♦ లేంద్రు కడకు
నమ్మహామౌని యేతెంచి ♦ యవనినాథ
దనుజమాయల కొకవేరె ♦ యనువు వినుము. 65

క. మాయాభేదినియన భూ
నాయక యొకవిద్యగలదు ♦ నాయొద్ద వివిధో
పాయవిధానవిధి న్నేఁ
జేయుదు నుపదేశ మిష్ట ♦ సిద్ధి ఘటింపన్ 66

గీ. అని సలక్షణభంగి న ♦ మ్మునివరేణ్యు
డమ్మహావిద్య నుపదేశ ♦ మాచరింప
నియతిఁ గైకొని కౌతుకో ♦ న్నిద్రుఁడగుచు
నవని నాథుఁడు సుఖసుప్తుఁ ♦ డయ్యెనంత. 67

సీ. తొలఁగు నీరీతి ♦ దైత్యుల మాయలని చూపు
విధమునఁ జీఁకటి ♦ విచ్చిపోయె
జరగు నీరీతి ని ♦ శాట ఫాలాక్షర
పంక్తినాఁ దారకా ♦ పటలిఁ విరిసెఁ
దలఁకు నీగతి యాతు ♦ ధానుల ప్రాణంబు
లను జాడఁబొలసె మం ♦ దానిలంబు
దరికొను నిబ్భంగి ♦ దైత్యుల హృదయంబు
లను మాడ్కి నర్కోప ♦ లాలి మండె

గీ. దనుజ శుద్ధాంత కాంతా వి ♦ తాన వక్త్ర
కాంతి యేపొల్కిఁ బొలియు నాఁ ♦ గమల వైరి
తన కళాస్ఫూర్తి యంత కం ♦ తకుఁ దొలంగె
వరుణ దిగ్వధి కడఁజేరి ♦ వాడఁబాఱె. 68

గీ. సవిధకీర్ణ వరాగాగ్ని ♦ సాక్షిగాఁగఁ
దమ్మివిందు కరగ్రహ ♦ ణ మ్మొనర్పఁ

బొలుచు పశ్చిమకిని నల్ల ♦ పూసదండ
గట్టినాఁడన నెలదేఁటి ♦ గములు పొదలె. 69

శా. ఆరీతిం దహనోదయంబగుడుఁ గా ♦ ల్యా క్రీడసు ల్దీర్చి మ
త్తారాతిద్విపయూథకేసరి సుతం ♦ డాప్తప్రధానావళిఁ
వే రావించి బలంబు లేర్పరప వే ♦ ర్వేర న్నియోగించి య
వ్వీర క్రూర నిశాటకోటి పెకలన్ ♦ వ్రేయించె నిస్సాణముల్ 70

ఉ. పెల్లగు నమ్మహారవము ♦ పేర్చి సరోజభవాండ భాండముల్
చిల్లులు వోఁ బ్రచండగతి ♦ సేనధరాస్థలి యీనెనో యనన్
వెల్లిగొనంగ నేర్పరిచి ♦ నిర్దయత న్నడిపించె నంత న
ద్యల్లియ కాలకాల సదృ ♦ శార్భటిఁ బూర్వ సుపర్వ సైన్యముల్. 71

క. తొల తొలఁగు తొలఁగు మనుచున్
నిలు నిలు నిలుమనుచుఁ గవిసె ♦ నిజసైనికులన్
బిలు పిలువు పిలువు మనుచున్
బలువిడిఁ జనుదెంచె లోక ♦ భయదంబగుచున్. 72

మ. నలుదిక్కు ల్గబళించు నయ్యుభయ సై ♦ న్యవ్యగ్ర గర్జార్భటుల్
గలయంబర్వఁ బునః పయోధిమథనో ♦ త్క్రాంతన్నిలింపాసురా
వలి బల్మిం బెకలింప వచ్చెననుచున్ ♦ వైశాఖ శైలంబు బె
గ్గిలి కూపెట్టె ననంగఁ జొప్పడు గుహా ♦ గేహ ప్రతిధ్వానముల్. 73

వ. అప్పు డయ్యిరువాగు నొండొరులం దలకడచి పెలుచాదల పడినయెడఁ బొడమి దుమ్ము క్రమ్ముకొని సంజకెంజాయయనం జాలి మెఱయు ఘాతుక దైత్యేయ నికాయ కాయచ్ఛాయలు కొదమ చీకటి కోమల నం బొలయఁ గలయఁ బరస్పర ఘటిత పరశు పట్టిస ముసల పరిఘా విస్ఫులింగంబులు గగనాంగణంబునం గనుపట్టు నుడుగణంబులనం గడలుకొన భయంకర విశంకట దనుజ ప్రతాప తపనుండు గ్రుంకిన దోఁచు సాయంకాలంబు ననుకరించెఁ బటుపటహ భేరీఢక్కాఢమఢమ ధ్వానంబుల వలన మద కరటి పటల చటుల ఘీంకారంబుల వలన

నఖరవ్యపవన జనసత్వ నిర్వాపణ ఘూర్వహ మహిత మహావాహ వ్యూహ దోహల హేషా నినాదంబుల వలన వికట దితిజ వదనకుహర ముహుర్ముహురుదిత జవ్యాఘ కహ కహారవంబుల వలనం గలను విలయ సమయ సముదిత సముజ్జృంభితంబగు నంభోధినిం బోలె నంత కంతకుం బంతంబులు పలుకు దనుజా మనుజులం జుట్టుముట్టి బలిమి నలిమి యలిగి యులుగులత్తోడంగూడ మ్రింగినం గ్రక్కక తత్తన్మత్త రక్షో వక్షంబు లక్షుపటి కొక్షేయక ముఖంబులం గ్రుచ్చి హెచ్చిన మచ్చరంబునం బెచ్చు పెరిగి సమున్నిద్రు లగుచు నగుచు సమున్నత స్తంభంబులు వ్రక్కలించుకొని యుక్కున వెడలు నృసింహ మూర్తు లం బోలి యేతెంచు నవ్వారి వీరవర్గంబులును దితిసుతుల కాయంబు లతి నిశిత శరపరంపరలం జొన్పి చించి చీకాకుచేసి దాసి పాశంబు లం బెనిమినం గనలి నయనంబుల ననలంబు గ్రక్కుచు గ్రక్కున ముక్కుం జెమర లదర నదరి వడిం జరుదేర నేపున మూఁపు లెక్కింప వాని తెగువం దిగిచి చేతుత్తులం గుత్తుకలు తఱిగి తరగని బలంబుల నొఱఁగఁదోచి చంగున నేనుంగుల మీఁదికి లంఘించు నకించి దంచిత పరాక్రమా న్వితులగు మావంతులును నగుచుం బోరు ఘోరంబయ్యె నయ్యవసరంబున 74

సీ. ఉప్పరం బెగసి వే ♦ కుప్పించి రథగత్య
రథికులం దుమురు గా ♦ రాచివైచు
నురువడిం బఱతెంచి ♦ యిరుపక్కియలుదాఁకి
గంధ సింధురకోటిం ♦ గనుపుకొట్టు
జెవులు జిక్కించి చూ ♦ చి మునిగాల్వడిన నెత్తి
కొట్టుం దేజులం జావ ♦ కట్టు వడఁగ
వెనుకొనిరా నుద్ద ♦ విడిం జివుక్కునం దన్ను
దర్పిత భటకోటి ♦ తలలు డుల్లం

గీ. వరిళయ ధారాధరస్ఫీత ♦ భయద నినద
కఠిన హేషలు దిక్కులం ♦ గ్రమ్ము కొనఁగ

గలఁచి నృప సైన్యమెల్లఁ జీ ♦ కాకు పడఁగ
జగతి కంపింప నాలోహ ♦ సైంధవంబు. 75

మహాస్రగ్ధర. వచ్చిన్ మత్తేభ రాజిన్ ♦ బ్రకుపిత మదహా ♦ ర్యక్షమై
ఘోరభంగిన్ । గొబ్బున్ రథ్య వ్రజంబుల్ ♦ ఘుటఘుట రభటిల్ ♦
ఘోణియై పైపయిల్ గా । బ్చిచ్చి యేతెంచి యేర్చున్ ♦ జిటజిట
మరుచుల్ ♦ సేనలంగాన మాడ్కిల్ । వచ్చుంగా ర్కొంచుగాథ ♦
ధ్వని మొగలయితా ♦ వాన వెన్నెల్లి నిండల్. 76

మ. అపుశమ్మానవనాథ పుత్త్రకు తదీ ♦ య వ్యగ్ర రాదాత్రిశే
కప రాభూతములైన సైన్యములఁ జ ♦ క్కం జూచి యీ వాజియే
చి పటాపంచగఁ జేసి సైన్యముల గా ♦ సించెట్టెడున్ దీని నా
దు పటు క్రూరతరాహతిం దును రొన ♦ ర్తున్ దానవు ల్బెగ్గిలన్.

మ. అని యూహించి తదీయ సైంధవముపై ♦ నాగ్నేయ బాణంబువై
చినఁ దద్దేహము నీరుగాఁ గరఁచుటన్ ♦ జింతాకుల స్వాంతుఁడై
దను జుండీతఁడ జేయుఁ డంచు నిజదో ♦ ర్దర్పంబు చాలించి హె
చ్చిన భీతిం బరువెత్తి తద్బిలము చొ ♦ చ్చెన్ దివ్యు లుప్పొంగఁగన్.

ఉ. చొచ్చినఁ బోకు పోకు మను ♦ చున్ నృపకేసరి తేరుడిగ్గి నీ
వెచ్చటి కేగినన్ విడుతు ♦ నే పటుబాణ పరంపరాహతిన్
బచ్చడి చేయువాఁడ నని ♦ ఫాల నటద్భ్రుకుటీ కరాళుఁడై
యిచ్చ నొకించుకేనిఁ జలి ♦ యింపక తద్బిలవీథిఁ దూఱఁగన్. 79

శా. ఆలో మాయఘటించి యాదితి సుతుం ♦ డాభీల కాలానల
జ్వాలోదగ్ర విషంబు గ్రక్కుచు ఫణ ♦ వ్యాకీర్ణ రత్నప్రభల్
గ్రాలం గ్రూర భుజంగమై యగుగు దే ♦ రం జూచి యమ్మాయ వే
వ్రీలంజేసె మునీంద్ర సూచిత మహా ♦ విద్యా ప్రభావంబుల్. 80

ఉ. సాహసి కాగ్రగామి నృప ♦ సత్తముఁ డట్లు తదీయ ఘోరమా
యాహమికల్ హరింపుచు ని ♦ రంకుశ విక్రమకేళి చూప ను
త్సాహముదక్క యాత్మపురి ♦ చక్కటికేగఁగ నొక్క కాళికా
గేహము చొచ్చి యద్దనుజ ♦ కీటము పాటిలు భీతిపెంపునన్. 81

ఉ. కావుము కావుమో గిరిశ ♦ కామిని యో జగదేకమాత నీ
లావున నింతకాలము హ ♦ ళాహళి సేయుచు వైరికోటి నేఁ
డీ వనసీమ చొచ్చినను ♦ నించుక యేని గణింపకెవ్వఁడో
చేవ నెదిర్చి తుత్తుమురు ♦ చేసె మదీయ నిశాట సైన్యముల్. 82

ఉ. అంతటఁ బోక తావకస ♦ రాగతలోహ తురంగమంబు నిం
తిం తలఁచేసినైచి తన ♦ యేత్తిఱ చూపిన నిబ్బలేక వి
భ్రాంతి వహించి నీచరణ ♦ పద్మముచేరితి వాఁడెవచ్చెఁ గా
లాంతకు భంగినాకు నభ ♦యంబు దగం గృపచేయు శాంభవీ. 83

క. అని వాఁడు మఱువుసొచ్చినఁ
గనికర మొదవంగ భద్రి ♦ కాళీశ్వరి యో
రి నిశాట యోడ కోడకు
మని యూఱడిలంగఁ బలుకు ♦ న త్తఱి బోనన్. 84

ఉ. వాలిన బాహుగర్వమున ♦ వానిపిఱుందన పోయి యమ్మహీ
పాలక నందనుండు గుడి♦బజ్జకునై చని యోరి నిన్ను మ
త్కాల భుజంగతీవ్రతర ♦ ఖడ్గముచే బలియిత్తు నిమ్మహా
కాళి కుచోజ కుంభపరి ♦ కల్పిత రక్త కపాల పాళికిన్. 85

వ. అనుచు నవ్వీర కంఠీరవంబు చనుదెంచిన 86

సీ. కొప్పుపై నొప్పెడు ♦ కొదమ చంద్రునితోడఁ
గస్తూరికా తిల ♦ కంబుతోడ
సీమంత విరచిత ♦ సిందూర రుచితోడ
గ్రొత్తముత్తియపుఁ జే ♦ ర్పుచుక్కతోడఁ
దళతళ మను దంత ♦ తాటంకములతోడ
రమణీయ నాగహా ♦ రములతోడ
గల్లు గల్లను రత్న ♦ కంకణంబులతోడఁ
జిలుకైన చెంగావి ♦ వలువతోడ

గీ. ముద్దుమోమున లేనవ్వు ♦ మొలకతోడఁ
జల్లచూపులఁ గరుణార ♦ సంబుతోడ

శాంతరూపంబు గైకొన్న ♦ శంభురాణి
యమ్మహాకాళి ప్రత్యక్ష ♦ మయ్యెనపుడు. 87

గీ. ఇట్లు సాక్షాత్కరించిన ♦ యఖిల జననిఁ
గాంచి విస్మయ సమ్మదా ♦ క్రాంతుఁడగుచు
మనుజ నాథుండు సాష్టాంగ ♦ వినతిఁ జేసి
వేచి కరములు మౌళిఁ గీ ♦ లించి నిలిచి. 88

—♦ దండకము. ♦—

జయ జయ జగదీశ్వరీ సంతతానశ్వరీ విశ్వదైశ్వర్య సంకల్పనా కల్పవల్లీ కృపాఫుల్ల పల్లీ మతల్లీ స్మృతోల్లాస యోగీశ హృచ్చంచరీకా విపంచీ వినాదానుమోదా, పదారాధ నోద్భూత కౌతూహ లాయత్త జంభాసురారాతి జాతోదరీ ముఖ్యలేఖాంగనా మండలా పుష్పవత్కుండలా కుండలిగ్రామణీ కంఠహార ప్రియంభావుకా భావుక శ్రేణికా భావుకాపాదనాయత్తచిత్తా మనోదృగ్విధాజ్ఞాత వృత్తా భవానీ భవానీత ఖేదద్రుమూలచ్ఛటాచ్ఛేదినీ నిత్యసమ్మోదినీ నిగమ వినుత శంభుకళ్యాణ వేళాబలాలబ్ధ శోణాక్షత భ్రాంతి కృత్ఫాలనేత్రా సదా సచ్చరిత్రా భవారాతికిం బ్రీతికల్పించు సన్నాతియున్ నీవకావే తమాల ప్రభానీలవై శోణ మాణిక్య భాస్వత్కటీచేలవై నేత్రవద్భాలవై యాశునిల్లాలవై యున్న యాగట్టురాచూలి విన్నీవకావే సుధాహార విశ్రాణనోదార దర్వీకరావిర్భవద్రోహ ముద్రా సమున్నిద్రశోభాకరా కిన్కచేఁ దాఁకి యుచ్చండదోర్దండ పాండిత్యముల్ చూపి మొండొడ్డినన్ జండముండామరారాతులన్ వాతులన్నెత్తురుల్ గ్రక్కవే త్రొక్కి ఖండించి తన్మస్తముల్ హస్త పద్మంబులంబూనవే వేసవేల్దానవుల్తోడురాఁ బోరులం బోరు తత్సైరిభాకార ఘోరాసురుంబట్టి పెనిట్టవై మట్టి, లోక ప్రసిద్ధంబుగా వానిమూర్ధంబు నీపాద పీఠంబుగా నున్నవే నొంపవే బల్విడింగట్టి శుంభు న్నిశుంభుం గరాంభోజ శూలంబునన్ గ్రోలవే, రక్తబీజామర ద్వేషి క్రొన్నెత్తురువ్వెత్తుగా దుర్గునిం ద్రుంచి దుర్గాభిధానంబునుం బొందవే పొందవే లోకముల్ శాకసంపత్తిమైఁ బ్రోచి శాకంభరీ నామ

విఖ్యాతి నోయమ్మ యావేదముల్ వాదములేనియ నీవేదముల్గాన కిచ్చో
ట నీపాదముల్గాంటి నేనుంటి నావంటి పుణ్యుండు లేఁడెచ్చటన్. 89

శా. తల్లీ శాంభవి లోకపావని సము ♦ ద్యద్భక్తితో నెవ్వఁడేన్
హృల్లేఖన్ భవదీయమంత్రి కలనా ♦ హీనస్థితింగాంచు వా
ఁడిల్లాలై విహరించుఁ బంకజ పుటీ ♦ హేలాగతుల్మావి సం
పల్లీలావతి వానిభాగ్యము నిలిం ♦ ప స్వామికిం గల్గునే. 90

మ. అనియమ్మానవనాథ పర్యుఁడు శచీ ♦ యాంఘ్రిద్వయిం గ్రమ్మఱన్
వినతుల్ సేయ భవాని సత్కృప మది ♦ న్నిండారనో రాజ నం
దన నీ చండభుజా పరాక్రమ కళా ♦ ధైర్యంబు లే మెచ్చితిన్
గొనుమే యిచ్చెద నొక్కదివ్యమణి నీ ♦ కర్ వేడ్క సంధిల్లఁగన్. 91

గీ. ఇమ్మహామణి తావకా ♦ భీప్సితముల
వలయువేళల సమకూర్చు ♦ వసుమతీశ
యమర వర్ణిత మిది యోని ♦ యభవురాణి
యవనినాథున కొసఁగి య ♦ త్యాదరమున. 92

క. జననాథ నాకుఁగాని
ద్దనుజుని మన్నింపు మిపుడు ♦ తాపస పుత్రిన్
గొనివచ్చు నొక్కయోగిని
యనిపల్కి యదృశ్యయయ్యె ♦ నంతటిశోసన్. 93

సీ. అలికంబు పైరక్త ♦ తిలకంబు తెలిగన్నుఁ
గవయందుఁ గాటుక ♦ కర్ణపాశ
ములఁ బటికంపు గుం ♦ డలములు గళమున
సంకుఁ బూసల కంఠ ♦ సరులు గుబ్బ
చనుదోయి వన్నెకు ♦ చ్చులిగంత దాపలి
కరమునందు విభూతి ♦ కక్షపాల
పాణిపద్మంబున ♦ మాణిక్య మయవీణ
పదయుగంబునఁ బైఁడి ♦ పాదుకలును

గీ. నుదర బాధంబు లాతంబు ♦ యోగపట్టె
సింగినాదంబు బెత్తంబు ♦ చెన్ను మెఱయ
నుట్టిపడ్డట్టు యోగిని ♦ యోర్తువచ్చి
లీలనారాజశేఖరు ♦ మ్రోలనిలచి. 94

ఉ. రమ్మన్నృపాల నీదగు ప ♦ రాక్రమకేళికిఁ జాలమెచ్చి మా
యమ్మ భవాని సంయమి కు ♦ లాగ్రణి కూరిమిబిడ్డ నిచ్చిరా
పొమ్మన వచ్చితిన్ శిఖరి ♦ పుత్త్రిక సేవకురాల నామ గే
హమ్మున నున్న యప్పడుచు ♦ నప్పనచేసెద నంచుఁ బల్కినన్. 95

క. మనమునఁ బ్రియపడి యయ్యో
గిని పిఱుఁదం బోయి సరస ♦ కిసలయరేఖా
జనక రుచి పుంజ మంజుల
కనకమయంబైన యొక య ♦ గారముఁ గనియెన్. 96

క. కని చేరఁబోయి యోగిని
పనుపున నొక రత్నవేది ♦ పైనుండి ఫలా
వనిజాత జాతగిరిజా
ప్రణుతి పరోదగ్ర పతగ ♦ భాషలు వినుచున్. 97

క. అచ్చట సేదలుదీఱి వి
యచ్చర విభున కొసఁగె నపు ♦ డాతిథ్యముల
త్యచ్చయ కౌతుకమున నట
నచ్చెరువుగ వచ్చి నిలిచె ♦ నమ్ముని సుతయున్. 98

క. చక్కని యా బాలామణి
నక్కునఁ గీల్కొలిపి దీని ♦ నవనీశ్వర పే
రుక్కున విశంకటుండై
చక్కటిఁ గొనపోవఁజూచి ♦ సదయహృదయనై. 99

గీ. ఓడ కోడకు మనుచు నేఁ ♦ గూడ బోయి
వాని నదలించి యీ మాని ♦ వరుని కూర్మి

తనయుఁ డోడ్కొని వచ్చి మ ♦ త్పదన సీమ
నునిచితిని బాలుఁ గొనిపొమ్ము ♦ మునికి నిమ్ము. 100

క. అని పలికి రాజశేఖర
మనుజేశ్వర నేఁడు నాదు ♦ మందిరమునకున్
జనుదెంచితి గావున నే
నన ఘుంబగు నీ శుకంబు ♦ నర్పింతుఁ దగన్. 101

శా. తూచాతప్పకయుండ నాగమకథా ♦ స్తోమంబులం జెప్పు వా
చా చాతుర్యముగా నరా గతభవి ♦ ష్యద్వర్తమానార్థముల్
సూచించుచున్ మదిమెచ్చ నీ కిఁబుము పు♦మ్మన్ నెచ్చెలింబోలి యీ
రాచిల్కంగయికొమ్ము పార్థివకుమా ♦ రా యంచు వర్ణించుచున్.

క. శీతమయూఖ కళాధర
శాతోదరి పంచినట్టి ♦ శాంబవి యొసఁగెన్
భూతలనాథకుమారుని
చేతికిఁ గరుణారసంబు ♦ చిలుకం జిలుకన్. 103

సీ. ఇచ్చిన కీరంబు ♦ ఋషిపుత్త్రియును దాను
వరయోగినీ కాంత ♦ తెరువుచూప
బిలము వెల్వడి మౌని ♦ తిలకంబుఁ గనుఁగొని
సాష్టాంగ వినతుల ♦ నాచరింప
నాశీర్వచః ప్రౌఢి ♦ నతఁడు సంభావించి
యానందబాష్పంబు ♦ లావహిల్ల
దనయాలలామ న ♦ క్కునఁజేర్చి వాత్సల్య
వనధి నోలాడియో ♦ మనుజనాథ

గీ. యాత్మపురమున కీసేన ♦ ననిచి బదరి
కాశ్రమంబున కేతెంచి ♦ యచటి మౌని
పతులఁ గనుఁగొని దీవనల్ ♦ పడసివత్తు
గాక యనవుడు సంభ్రమో ♦ త్కంఠుఁ డగుచు. 104

క. జనకునకును జయలేఖల
ననిచి పురంబునకు సైని ♦ కావళిఁ బోవన్
బనిచి తపస్వియయి దాను
మనుజేంద్రుఁడు బదరికాశ్ర ♦ మంబున కరిగెన్. 105

మ. అతఁ డచ్చోటకిఁబోయి కన్గొనియె భూ ♦ జానేక శాఖాశిఖా
న్వితయూ మానికరస్థ ముక్తి తరుణీ ♦ వేణీకలాపాకృతిన్
పతతావర్తిత సప్తతంతు వలతభు ♦ క్సందోహ నీరంధ్ర ని
ర్గతధూమోద్భట హవ్యగంధములు ది ♦ గ్భాగంబులాగ్రమ్మఁగన్.

సీ. హోమధేను వాత్రి ♦ మొయ్యానట్టులు చూపఁ
గొనగోళ్ళ దువ్వెడు ♦ కోతులుపులులఁ
జిగురు దర్భలుగిల్లి ♦ మృగపోతముల కర్థి
నందంద యిచ్చు పం ♦ చాననముల
రాచిల్క బోదలఁ ♦ బోచి తెక్కల నీడఁ
జల్లఁగా బొదివెడు ♦ సాళువముల
బర్హాణ నిలయింపుఁ ♦ బన్నగార్భకముల
కుగ్గులువెట్టు మ ♦ యూరములను

గీ. దొండము లుగ్గించి కలఁగక ♦ యుండఁ దీర్థ
వారి దరినుండి కోరెడు ♦ వారణములఁ
జూచి యచ్చెరు వంది య ♦ స్తోకమాని
వర తపశ్శక్తి మెచ్చుచు ♦ వచ్చు నపుడు. 107

గీ. మునుల వెంబడి నవ్వార్త ♦ వినిచెలంగి
భానుమతి తల్లి యెదురుగాఁ ♦ బోయి తెంచి
కన్నుఁ గొనలను హర్షాంబు ♦ కణము లొలికి
జాలుకొనఁ జెప్పెఁ బాలిండ్లఁ ♦ బాలు దొలఁక. 108

ఉ. ఎత్తి కవుంగిలించి యొక ♦ యించుక సేపతి గాఢ కౌతుకా
యత్తతఁ దన్నుఁదా మరచి ♦ యంగలతన్ బులకాంకురాళి పె

ల్లోత్తఁగ మాటి మాటికిఁ బ ♦ యోధర పాళిక నప్పళింపుచుఁ
ద త్తరుణీ లలాము నిజ ♦ నందనమై నిమిరెం గరంబునన్. 109

గీ. అట్లు సమ్మద విస్మయా ♦ య త్తయగుచు
మనుజనాథుని దీవించి ♦ మగనిఁ జూచి
యీ శుభాకార యీబాల ♦ యీసుశీల
మగుడ జన్మించి నట్లయ్యె ♦ మనకునేఁడు. 101

వ. అనుచు నప్పరమ సాధ్వి పలుకునప్పుడు మునిపత్నులు దమలోన.

సీ. కనకావని ధర ♦ కార్ముక వరలబ్ధుఁ
డను పెంపుగాంచిన ♦ యతఁ డితండు
మునితప ష్షష్టాంశ ♦ మునకుఁ బాత్రుఁడు నాఁగ
నవనియంతయు నేలు ♦ నతఁ డితండు
అఖిల కంటకుఁడైన ♦ యలవిశంకట దైత్యు
నదటు పోకార్చిన ♦ యతఁ డితండు
పులినోరి కండమై ♦ పోయిన మనభాను
మతిఁ గ్రిమ్మరించిన ♦ యతఁ డితండు

గీ. చూడ రమ్యమ్ము మనోహర ♦ శుభచరిత్రు
భువన నయన చకోరికా ♦ పూర్ణచంద్రు
సజ్జనావన దాక్షిణ్య ♦ జన్మభూమి
యనుచుఁ బొగడుచు దీవింప ♦ నాదరమున. 112

గీ. వచ్చి యచ్చటి మునులకు ♦ వందనంబు
లాచరించి నృపాలకుం ♦ డాతిథేయ
సత్కృతులుగాంచి యారాత్రి ♦ జరపి కాల్య
కృత్యములు దీర్చి మఱునాఁడు ♦ ప్రియము దొలఁక. 113

ఉ. మందర గోత్రధీరుఁ డన ♦ మాన యశోనిధి రాజలోక సం
క్రందనుఁ డమ్మహా ముని ని ♦ కాయము వీడ్కొని వచ్చితోవ మ
ధ్యందిన వేళమైన నతి ♦ దాహముచే రథరథ్య పం క్తి దూ
లం దన సారంథిగని జ ♦ లంధర శౌర్య కళాదురంధరా 114

ఉ. వచ్చె ననేకదూరము జ ♦ వంబునఁ దేజులు చాలడస్సె నీ
విచ్చటి కాననాంతర మ ♦ హీస్థలి యారసి నీరుచూపి లేఁ
బచ్చికమేపు మిక్కనక ♦ పంజర కీరము నిష్ఠ మిక్కిలి
నొచ్చిన దీపఫశ్రమము ♦ నూత్నఫలావళిఁ దీర్పఁగాఁ దగున్. 115

గీ. మరుని బాహుప్రతాప ♦ విస్ఫురణఁ గెరలి
హరుని గెలిచెద నని పోవు ♦ కరణి విహార
మాణ విహగ గరుజ్జాత ♦ మారుతముల
మింటికెగయు పరాగంబుఁ ♦ గంటె యెదుట. 116

ఉ. చూచితివే యినప్రభలు ♦ సోఁకని మంజు నికుంజ పుంజముల్
చూచితివే ఫలావళుల ♦ జొంపములైన రసాలసాలముల్
చూచితివే విధూతఫల ♦ శుద్ధ వితర్దిక లల్ల పుష్పనా
రాచవిహారసౌధమనఁ ♦ గాదగు కానన మింత యొప్పునే. 117

క. తరుణ పవమాన మదకే
సరి పోతము విటపికుంజ ♦ సామజకుంభాం
తరములు గ్రొవ్వినఁ దొరఁగెడు
గురుమౌక్తిక భాతి రాలెఁ ♦ గ్రొవ్విరు లవిగో. 118

వ. అని వర్ణింపుచు. 119

లయగ్రాహి.

భూరి సహకార ఫల ♦ సారములు గ్రొచ్చి కసు
పారఁ దిని యాముకొని ♦ మారుని హయంబుల్
సారెఁ బథికుల్బెదరఁ ♦ గేరుచు దిశల్గలయఁ
బేటెములు వాఱుచు ను ♦ దారగతినాడన్
సారస మరంద రస ♦ పూరములు గ్రోలి ప్రతి
వార మనివార మని ♦ వారణ నటింపన్
భూరమణశేఖర కు ♦ మారుఁ డనురాగమునఁ
దేరుడిగి యుపవనము ♦ చేరఁ జని క్రేవన్. 120

క. వలమాన మత్త మధుకర
కలహంస క్రౌంచ బక ని ♦ కాయ గరుత్మ
త్కుల కలకలరవములఁ గొల
కొల మనియెసు నొక్క నింపు ♦ కొలఁకుం గనియెన్. 121

గీ. కాంచి యవగాహనము చేసి ♦ కనకపంజ
రాంత కీరంబుఁ దివిచి నీ ♦ రార్చి తెచ్చి
చాల దప్పితిగా పక్ష ♦ శ్రాంతి ననుచు
నృపతి కరమున నెమ్మేను ♦ నిమిరి నిమిరి. 122

క. ఱెక్కల తడి వోనార్చుచు
నక్కునఁ గీల్కొలిపి ముద్దు ♦ లాడుచు మది పెం
పెక్కిన వేడుక నందలి
చక్కని హిమవారి చల్లి ♦ చల్లని నీడన్. 123

క. విప్పుగల విధు శిలాస్థలి
జిప్పిలి మకరందరసము ♦ చిలికెడు పువ్వుం
జప్పరము క్రింద వైచిన
కప్పురపుం దిన్నెపై సు ♦ ఖస్థితుఁ డగుచున్. 124

క. భూదయితుఁ డప్పు డశనా
యాదశ జగదేకమాత ♦ యంభవుని యిల్లా
లాదిమ యోగిని యొసఁగిన
యాదివ్యమణిం దలంచు ♦ నంతటిలోనన్. 125

సీ. కలికి బేడిస కూటు ♦ వలఁ దోలు జిగిగల
కన్నుఁగవలఁ గాటు ♦ కలు ధరించి
కొదమ తుమ్మెద యొప్పు ♦ నదలింపఁగల కప్పు
గులుకు పెన్నిరికొప్పు ♦ లలవరించి
జక్కవ కవఁ గేరఁ ♦ జాలిన కుచకోర
కముల ముక్తాహార ♦ సమితిదాల్చి

క్రొమ్మించు పసగ్రమ్ము ♦ క్రొంగెలంకులజిమ్ము
పసని రత్నపుసొమ్ము ♦ పరిధవించి

గీ. యరుణ కంజాత కర్ణికాం ♦ తరము వెడలి
వచ్చు తుమ్మెద కేవల ♦ వడువుదోఁప
మానినీమణి యుగ్మ మ ♦ మ్మణి జనించి
నృపతి వెఱఁగంద ముందట ♦ నిలిచె మఱియు. 126

మ. కలమాన్నంబు ఘృతంబుఁ బాయసము శా ♦ కవ్రాతముల్ పిండివం
టలు పాల్దేనియ జున్ను వెన్నయిడి యా♦నాలుక్కురల్ చక్కెరల్
ఫలముల్ పానకముల్ రసాయనము లం ♦ బళ్ళారుఁ బిండ్లారుఁగా
యలు బజ్జల్ దధిపిండఖండములు నం ♦ దావిర్భవించెం దగన్. 127

క. అంతటఁ బసిండి యటికల
దొంతులు గావించి యో వ ♦ ధూమకరాంకా
సంతత వితరణరేఖా
చింతామణి యింత తడవు ♦ సేయుదె యనుచున్. 128

క. హల్లకగంధులు మృదుకర
పల్లవముల వెలచి పసిఁడి ♦ పళ్ళెరములను
ద్యల్లీలఁ బెట్టిరి మహీ
వల్లభునకుఁ జులుకి రాచ ♦ వారికి నచటన్. 129

ఉ. సంచిత బాహుమూల రుచి ♦ సంపద పొంపిరివోఁ గెలంకులన్
గుంచె రొకర్తు వైవ నొక ♦ కోమల పల్లవ పాణిలీల వ
డ్డించె నృపాలమౌళికిఁ గ ♦ టీతట హాటకమేఖలా సమ
భ్యంచిత కింకిణీరవము ♦ నందియమ్రోఁతలు సందడింపగన్. 130

గీ. తనదు మధురాధరముఁ బోలఁ ♦ దలఁచు ననుచు
సరస కదళీఫలంబుల ♦ చర్మ మొత్తు
నోజ వాలారు నఖముల ♦ నొలిచి యొలిచి
రాజకీరంబునకుఁ బెట్టె ♦ రాజవదన. 131

గీ. రసి రసాన్నము లీకీతి ♦ రత్నపుత్రి
యర్పణము చేయ వేడుక ♦ నారగించి
రాజు రాజీయు రాజకీ ♦ రమును దృప్తిఁ
బొంది వసియింప నంత న మ్ముఖ♦ తముతోఁప. 132

గీ. సతులు భాండాది వస్తు సం ♦ తతులు మగుడఁ
దాల్ప లోఁగొని కాళికా ♦ దత్త దివ్య
రత్నమేపారె నారాజ ♦ రత్న మెదుట
విశ్వరూపంబుఁ జూపిన ♦ విష్ణుఁ డనఁగ 133

క. అమ్మణిప్రభావమునకున్
సమ్మదమునఁ బొంది రాజ ♦ చంద్రుఁడు మౌళిం
గ్రమఱఁ దాల్చి విభాకర
సమ్మిళిత ప్రథమశైల ♦ సమత వహించెన్. 134

గీ, అపుడు కీరకుల స్వామి ♦ ననుచరించి
వితత ఫలముల చవులు చూ ♦ చితివె తనియ
సకల భాషావిశేష వి ♦ జ్ఞాన చతుర
యింత యొప్పిదమయ్యెనే ♦ యీ దినాబు.  135

శా. కాళీ దైవత దత్తరత్న మహిమల్ ♦ గంటే వధూరూపరే
ఖా లాలిత్యము చెప్పఁ గొత్త బహుళా ♦ కదివ్య సంభార ధా
రాళస్వచ్ఛ సుధార సోన్నతి యని ♦ ర్వాచ్యంబు కస్తూరికా
కాలాగర్వ సులేపసౌరభము లా ♦ ఘ్రాణింప నిం తొప్పునే. 136

క. మతిఁదలఁపఁ జోద్యమిదియో
పతగ కులోత్తంస యనుచుఁ ♦ బలికినఁ బ్రీతిన్
జతురాగమార్థ సంగ్రహ
చతురుఁడు శుకలోకపాక ♦ శాసనుఁ డనియెన్. 137

శా. ఓరామా మకరాంక యోరిపుజ ♦ యోదోర్యగాతి నిశ్శంక నీ
యారూఢోన్నతి నీకుఁగానఁబడ ♦ దాహా రాజ మాతుండవే

మాశారాతి వరప్రసాదగుణ సం ♦ పన్నుఁడ వట్లాటచే
గారాపు నున్నతునట్లు ప్రోవఁదగవే ♦ కాళీమహాదేవికిన్. 138

చ. అనఘచరిత్రి యీమణి య ♦ నర్ఘ్యము కానొక నాఁడు పార్వతీ
వనరుహపత్త్రనేత్రి నెర ♦ వాదితనంబున జూదమాడి గె
ల్చిన మదిఁ గౌతుకం బొదవ ♦ శీతమయూఖకళావతంసుఁడ
వ్వనితకు నిచ్చె నీకు నతి ♦ వత్సలతన్ గృపజేసెఁ గాళియున్. 139

క. జననాథచంద్ర యీమణి
యనిమిష లోకైకవంద్య ♦ మనఘుఁడు మును నీ
వానరించిన సుకృతఫలం
బునఁ గలిగెంగాక కలదె ♦ పురుహూతునకున్. 140

క. అనిపలుకు చిలుక పలుకుల
కనురాగ రసాబ్ధినోల ♦ లాడుచుఁ గేళీ
వని నిట్లు ప్రొద్దు పుచ్చెన్
జనపతి యయ్యెడ వసంత ♦ సమయం బగుటన్. 141

ఉ. చిత్తజమూర్తి భవ్యగుణ ♦ సింధువు సింధుఁ డనంగ నొప్పు భూ
భృత్తిలకంబు పుత్త్రిక శ ♦ రీర కళావిభవాభిభూత వి
ద్యుత్తతియైన కాంతిమతి ♦ యుత్సవనీయ వనీవిహార సౌ
ఖ్యోత్తమతిన్ సఖీజన స ♦ హస్రముగొల్వఁగ వచ్చియచ్చటన్. 142

సీ. ఈవల్లి బెల్లిమై ♦ యీవల్లి పూఁబోడి
కీవల్లి విరువెల ♦ యించుఁదరుణి
లేమావి చిగురాకు ♦ లేమావివే యింక
లేమావిజృంభింప ♦ లేరునీకుఁ
గురువింద మొలనూలు ♦ గురువిందలవె చూడు
గురువిందగతినొప్పఁ ♦ గోయువలయు
వట్టివేరునకుఁ గే ♦ ల్వట్టవే రుచిరాంగి
వట్టివేరుగఁ జేయ ♦ వలదు నన్ను

గీ. నన్ను నెవ్వతె కందుకో ♦ నలవిగాదు
గా దురాశలెగాని య ♦ క్కాంచనాలి
నాలితనములు మానవే ♦ నాతియేల
యేలవాఁడుదు చూఁడుమా ♦ యేలలీల. 143

చ. కిసలయపాణి లేఁతనను ♦ గెంజిగురాకు మెఱుఁగు మోవికిన్
గిసరు దొలంగి పోవలసి ♦ కేళి వనాంతరలక్ష్మి బోటియై
మసిఁ జిటిబొట్టుపెట్టె నను ♦ మాడ్కిఁ దదాసన వాపసంపదన్
భసల కిశోరకంబుగను ♦ పట్టెకు నల్లదె పల్లవాధరా. 144

గీ. అబల చూడు శివద్రోహి ♦ యనుచుఁ గెరలి .
యతనికంకణ శేషాహి ♦ యావహించి
నాలికలు గోయు పగిది వ ♦ నాలి చరిత
లాలి తైలా లతాగ్రప ♦ ల్లవము లమరె. 145

చ. కలిత కపోలకాంతి కళి ♦ కల్ దళుకొత్త నొకర్తు తీఁగె యు
య్యాల వడి నాడువేళఁ జర ♦ ణాంబుజ నిర్మిత లాక్షసోఁకి త
త్తలమహిజాత పల్లవ వి ♦ తానము మించె మదీయ సామ్యమున్
దలఁపకు మంచుఁ దత్పదము ♦ తన్నిన నెత్తురు గ్రుక్కెనో యనన్. 146

చ. తెలివయొకర్తుతోడి సఖి ♦ తేట కనుంగవ చూపు డాలు గ్రి
క్కిరిసిన గ్రొవ్విరిం దొలుత ♦ నించిన వేడుకఁ గోసి తాన క్రొ
మ్మఱి నొక సంచర ద్భ్రమర ♦ మంజరి నల్లనఁ జూచి కోయఁ గే
లఱచిన మిట్టిపడ్డఁ జెలి ♦ కత్తెలు నవ్విరి చిన్నపోవగన్. 147

ఉ. ప్రోడయొకర్తు పువ్వుఁ బొదఁ ♦ జొచ్చి సుధారస ముప్పతిల్లమా
టాడినఁ దోడనాడు శుక ♦ మంచుఁ దటుక్కునఁ జేతఁబట్టి ము
ద్దాడుచు నున్నదల్లదె ని ♦ జాధర బింబమునే తదాస్యమున్
జూడుఁడు వానిఁ దేర్పఁ డని ♦ చూపుచు నుండు తెఱుఁగు దోఁపఁగన్

రగడ.

పట్టు పట్టు మని ♦ పడఁతు కచంగన
నెట్టు డాకెనే ♦ యిది పిలుచంగన

నలిపి వైవకే ♦ నవకలి కావలి
యలి నీలాలక ♦ యదిమూ కావలి
పొదఁ బిక మున్నది ♦ వో మున్నాడకు
నది బెదరించిన ♦ నటు నన్నాడకు
పొగడ బొ్రితియే ♦ పోనేలేవడి
నిగురు బోఁడి కా ♦ నెంతయు లేవది
చిలుకుఁ జేనియలఁ ♦ జీరకు నేలకు
నలవిగాదది దు ♦ రాశల నేలకు
మలరు దండకై ♦ మాఁరము నమ్మకు
కలికి యీడు నూ ♦ కల్లరి నమ్మకు
అందని విరులకు ♦ నాఱిడిఁ బాఱకు
విందు రమ్మనిన ♦ పీడం బాఱకు
పలుపగు మొగ్గలఁ ♦ బదనుల కూనకు
మెఱుపగు దండకె ♦ యీలత కూనకు
ఎలమొగ్గలకై ♦ యెక్కకుతీవల
చెలియున్నది విరి ♦ చేమం తీవల
నింతి వల్లికై ♦ యింతటి మానిసి
యింతచేసెఁ బో ♦ ని త్తటి మానిసి
పువ్వుల గొలగొని ♦ పొలఁతుక చివ్వకు
మెవ్వరేగిరే ♦ యిప్పుడు చివ్వకు
తప్పదు మొదలనె ♦ తగవనువారము
చెప్పిన నిదిగో ♦ చెలిపగవారము
బాలచేత నీ ♦ ఫలములు రాలవు
కూలఁగ దో్రిచుట ♦ కొఱకై రాలవు
తలిరు బోడిఁ నీ ♦ తలఁపునఁ గన్నెర
వలదు తేనెలకు ♦ వంచకు గన్నెర
సాదులేమతో ♦ జవ్వని వావిరి
వాదులేల యీ ♦ వనిఁ గఱవావిరి

పోలయు వే సితే ♦ పువ్వుల వాటులు
నెలంత మెచ్చితవి ♦ నీ కలవాటులు
గెలిచేసె నీ ♦ నేదఁగి కొవ్విరి
బాల చీరెకా ♦ పడఁతులు కొవ్విరి
యిఁగురు బంతికై ♦ యీానవ లాకట
జగడ మాడెనే ♦ సతి మేలాకట
తేఁటి దాఁటు జిగి ♦ తేరెడు వేసలి
యేటికి ముడిచెద ♦ వే యిటవేసలి
విరులు చాలునా ♦ వేసర నేటికి
మరలి రారుగా ♦ మగువలు నేటికి
నని తమ తమలో ♦ నలివలు గెరలుచు
నునుబలుకుల చే ♦ నున్నతిఁ గెరలుచు. 149

క. చెలులార చూడుఁ డిదిగో
జలకేళికి మనలఁ గూర్చి ♦ సరసులు పనుపన్
చలిగాలి కాముకాలరి
కలితాంభో జాత పత్రి ♦ కలుగొని వచ్చెన్ 150

క. రా రండు రండు సలిల వి
హారమునకుఁ బోదమని ♦ లతాంగులు మిహికా
సారము నెనసెడు మిహికా
సారముఁ జేరంగఁ జనిరి ♦ సారస్యమునన్. 151

సీ. వనజవాసకుఁ దండ్రి ♦ పనిచిన ముత్యంపు
సరము చాడ్పున నంచ ♦ చాలు మెఱయ
జలదేవతా పుత్త్రి ♦ కలు దాల్ప నిచ్చిన
గిలుకల క్రియను ♦ జెందొవలు దనరఁ
గాసారపతి భుజాం ♦ గద వజ్రదీప్తుల
సరణి నూర్మ్ములబేసి ♦ సలు నటింప
సమధిక సౌరభ్య ♦ సంపదఁ గాపాడు
నాగకులనఁగ భృంగ ♦ గాళి దిరుగ

గీ. బత్త్రి ఫలపుష్ప కిసలయ ♦ భాగ్యరేఖ
నిండి పొంపిరివోవుచు ♦ నీడచూచు
పగిదిఁ దీరతరుశ్రేణి ♦ ప్రతిఫలింప
బాలఁతుకలు చూచి తమలోనఁ ♦ బొగడి పొగడి. 152

క. ఎల దీవలపైఁ గలయం
గలసిన చంద్రాతపంబు ♦ పోలిక జిలుఁగున్
వలువలు గట్టిరి పట్టిరి
పొలఁతులు నెలవంక పసిఁడి ♦ బుఱ్ఱట కొమ్ముల్. 153

వ. అటుల జలకేళీసన్నాహంబునఁ గన్నియలు పోయి సరోవరావగాహంబు గావించి. 153

ఉ. చిల్లులు చిల్కలం జిలికి ♦ చిల్కలకొల్కులు చల్లులాడ సం
పల్లలితాంగి చూచి కడు ♦ పైకొను వేడుక వారి పూరముల్
చల్లెఁ దదంగనాంగ లత ♦ లన్ నినుపారననంగ నవ్వెడు
త్ఫుల్ల పయోరుహాంతర మ ♦ ధూళిఁ జివుక్కునఁ జిమ్మెఁ దెమ్మెరల్.

క. లలనా సౌభాగ్యముగని
జలదేవత లళి నినాద ♦ సన్నుతు లెసఁగన్
దలలూఁచిన గతిఁ బంకజ
ములు యాతాయాతపాత ♦ ముల నటియించెన్. 156

గీ. పసుపు రొక్కటియై యొక్క ♦ పడఁతిఁ దఱుమ
నిలువుటీఁతలఁ బోదాని ♦ నీలవేణి
తోఁచె హిమరోచి పెక్కు మూ ♦ ర్తులు ధరించి
రాఁదలంకుచుఁ బాఱెడి ♦ రాహువనఁగ. 157

క. పడఁతుల కన్నులఁ గనుఁగొని
యుడియాసలఁ బోవుఁ దల్లు ♦ లని శఫరంబుల్
నిడుదలొ యటువలె నవికను
గొనఁదలొ జడమతుల కావి ♦ వేకము గలదే. 158

క. ఎఱిగింపకున్న సతులని
తెలియంగా రాదు నాచుఁ ♦ దీఁగెలు జడలున్
జలరుహాములు మొగములు నళి
కలభంబులుఁ జూపు చాలుఁ ♦ గత్తరఁ గలియన్. 159

మత్తకోకిల.

ఓలవెట్టుచుఁ దోలిపెట్టుచు ♦ నొండొరుల్ గనుఁబ్రామి పూ
ధూళిఁ గప్పుచుఁ గెల్చిప్పుచు ♦ దొడ్డ క్రొవ్విరి బంతులన్
వ్రాలి రువ్వుచు లీల నవ్వుచు ♦ వారివారికి వారిలోఁ
గేలిదేలుచుఁ జాలఁ బ్రేలుచుఁ ♦ గేకసల్ వడిఁ గొట్టుచున్. 160

మ. తరుణీ వక్త్రవిశేష సౌరభము ♦ లుద్యల్లీలతోఁ గ్రోలి వా
ని రుచిం బోలమి రోతఁ పుట్టి యట ♦ వాంతింజేసెనాఁ జూచితే
చిర దిందిందిర మర్యమాంశు పటలీ ♦ సంతప్త పంకేరుహాం
తర సంజాతసుధూళి ముక్కుచురు క ♦ న్నన్ వెళ్ళఁగాృసెం జెలీ.

ఉ. చంచలనేత్రి యీ కలికి ♦ జాడలు పోల్పడలయందుఁ గాన మొ
క్కించుక గానలేక మొగ ♦ మెత్తి కనుంగవ నవ్వు దేర రో
మాంచన మంచితాంగ యయి ♦ యల్లదె కన్గొనఁ జాల దొక్కరా
యంచ యహా వెసం దన కు ♦ లాంగన చెంగట రెక్కలార్పఁగన్.

గీ. అని వినోదంబు లాడుచు ♦ నబ్జముఖులు
గరఁగిపోయిన పూఁతలఁ ♦ గన్నుఁగొనల
బెరయు కెంపులఁ దత్సరో ♦ వరసమగ్ర
రతి విహార విరామ సం ♦ గతుల మెఱసి. 163

ఉ. కట్టినకేగు దెంచి తొలు ♦ కారు మెఱుంగులఁ బోలు నంగనల్
గట్టిరి చంద్రికాపులె సఁ ♦ గన్ దనువల్లు లిగెర్చినోయనన్
బెట్టిరి రత్నహారములు ♦ పేశలకాంతి గుళుచ్ఛ వైఖరిన్
బట్టిరి కేలి పద్మములు ♦ పంకజ సద్మకు నీడు జోడనన్. 164

క. జల దుర్గస్థలి హరిమ
ధ్యలుగొని తమ యంగ బలము ♦ సాధించి రనన్
కలకంఠాఱాంగి యెప్పటి
వలెఁ జక్రి సరోజ శఫర ♦ పఙ్క్తులు వెలసెన్. 165

క. అలకాళి ముఖాబ్జప్రితి
ఫలనా వరణాది కాంతి ♦ పటలంబులు ద
ల్లలనా సంగతిఁ బాయక కోలఁ
కులు వెనువెంట వచ్చు ♦ కొమరు ఘటించెన్. 166

క. కంజముఖు లపుడు వనమద
కుంజరము లనంగ నెఱసి ♦ కొలకొల రాఁ ద
న్మంజీర పుంజమంజుల
సంజాత రవంబు చెవుల ♦ చవులు ఘటింపన్. 167

క. చూత మదియేమిః క్రొత్తయొ
కోతామిట యువతి సమితి ♦ కోలాహముల్
తోతెంచె నంచుభూపతి
చూత లతాగృహము వెడలి ♦ చూడం జూడన్. 168

సీ. అడుగు దామర దోయిఁ ♦ దొడిగిన బంగారు
రవల పావలముద్దు ♦ రవము గులుకఁ
గొనబుగా నెఱిగిఁ గ ♦ ట్టిన క్రొత్త చెంగావి
చేల పయ్యెదకొంగు ♦ తూలియాడ
నతను గద్దియఁయుద్ది ♦ యనఁగాంచు పిఱుఁదు చెం
గటఁ గాంచికా దామ ♦ కంబు మెఱయఁ
గలికి జక్కవ పిట్ట ♦ కవ బిట్టువాలించు
గురుకుచంబుల సరుల్ ♦ గునిసియాడ

గీ. దంత కురువింద కాంతి బి ♦ త్తరము చిమ్మ
సరస సల్లాప గోష్ఠి న ♦ చ్చపలనయన

యల్ల నల్లన రాఁ జూచె ♦ న వని విభుఁడు
వేడ్క మున్నీరు పెల్లుబ్బి ♦ వెల్లిగొనఁగ 169

శా. ఆపుంస్కోకిలవాణి యూజలధిక ♦ న్యారత్న సౌందర్యరే
ఖాపాణింధమ మూర్తి యాత్రిజగతీ ♦ కాంతావతంసంబు కే
ళీ పద్మాకరవాంఛ దీఱ దనఁగా ♦ లీలావతిన్ నిద్దపుం
జూపుల్ గెల్వ వసంత మాడె మహీభృ ♦ చ్చూడావతంసంబుపైన్.

ఉ. మచ్చరికించి మారుఁడు కు ♦ మారుని బాణ విశేషవిద్యలన్
మెచ్చక బాహుగర్వమున ♦ మించి సమంచిత చాతురీ గతిన్
గుచ్ఛకపాళి నేసెఁ బువు ♦ గోలఁ గుభృత్తిలకంబు నట్టిచం
చచ్చపలాంగి నొక్కమొగి ♦ శంబరవైరి నుతింపఁ జెల్లదే. 171

ఉ. అక్కలకంఠి సప్పుడు వ ♦ యస్యలు గన్గొని యెంతవెఱ్ఱివే
యక్కట నీవొకానొక ధ ♦ రాధిప నందనుఁ గాఁ దలంచి పెం
పెక్కిన కూర్మిఁ జూడ కొరుఁ ♦ డెవ్వఁడు నేఁడిట కేలవచ్చు న
మ్మక్క వనీవిహారమున ♦ కై చనుదెంచిన పంచబాణుఁడే. 172

క. అని పలికె చెలువ చూపొక
యనువున మరలించి మగిడి ♦ రప్పుడు విభుఁడున్
మనమునఁ బెనఁగొను మమతన్
జనియెను శుక మున్న పువ్వు ♦ జప్పరమునకున్. 173

శా. ఆహా నేఁడొక క్రొత్తవింత శుకలో ♦ కాధ్యక్షయే నీ లతా
గేహంబింతకు మున్నుగా వెడలి వీ ♦ క్షింపన్ మనోజాశుగ
వ్యూహప్రక్రియఁ జూపుచాలఁడర వి ♦ న్యద్వల్లరీ పంక్తితో
బాహాబాహిఁ బెనంగు మేని జిగి జొం ♦ పం బింపు గల్పింపఁగన్.

ఉ. పుత్తడిబొమ్మయో చిలుక ♦ కోదయొ కెంజిగురాకుగుత్తియో
ముత్తెపు గోవయో మదన ♦ మోహన బాణమొ నా వనీవిహా
రోత్తమతిన్ సఖీజన స♦హస్రము గొల్వఁగ వచ్చిపోయె నేఁ
డిత్తటి నొక్కబిత్తరి య ♦ హీన వచోరచనా విశారదా. 175

ఉ. ప్రన్నని పాదముల్ చిలుక ♦ వారినఁ గందెడు మేనుదీఁగెయున్
వెన్నెలవాఱు నెమ్మొగము ♦ నిద్దపు ముద్దు మెఱుఁగుఁ జెక్కులున్
క్రొన్నెలవంటి నెన్నుదురుఁ ♦ గోమలబాహు మృణాలయుగ్మమున్
గన్నుల గట్టినట్లు పొడ ♦ గానఁగనయ్యెడు నాకు నెచ్చెలీ. 176

గీ. అల్లనల్లన సతి నడ ♦ యాడెనేని
గలికి పలుకుల వాల్గంటి ♦ పలికెనేని
యంచలంచల వచ్చు రా ♦ యంచ కదుపు
కూడ నేతెంచుఁ గీరంపుఁ ♦ గొదమపదుపు. 177

శా. కేలం దామరక్రొవ్విరిఁ బిర బిరన్ ♦ గేలీగతిం ద్రిప్పుచున్
వాలారంగొన గోళ్ళ ఘర్మకణికా ♦ వ్రాతంబు పోమీటుచున్
గ్రాలుంగన్నుల ముద్దులేనగ విగు ♦ ర్పున్ దెప్ప లల్లార్చ క
వ్రాలుంగంటి ననుం గనుంగొనిన భా ♦ వం బెన్నఁ డుంబాయునే.

క. ఆమగువ మోముతోడను
నేమిటనో హెచ్చిరిల్లి ♦ హిమకరుఁ డొకనా
డేమో పోలునఁట యిఁ కం
దామరతాఁ బోలుదు నన ♦ దైవము నగదే. 179

గీ. సవిధ తరుజాల పుష్పగు ♦ చ్ఛములఁ జూచి
యువిద చనుదోయి రోసి పై ♦ నుమిసె ననఁగ
ధగ ధగాయిత నిర్మల ♦ తారహార
వల్లికా కాంతి పుంజంబు ♦ పెల్లుడాసె. 180

క. నునుగాలి సోఁకినంతనె
తుసఁగెడు నెన్నడుము చేసి ♦ తోరపుఁ జన్నుల్
వనజభ వుఁడిట్లు సేయునె
కనికర మొకయింతయేనిఁ ♦ గలుగదు సుమ్మా. 181

క. పాలసినయంతటిలో నా
తలఁపుం బూదేనె యూను ♦ దతి చెలి చూపఙ

వలికరువలి కొనిపోమొకు
నెలకొను తమకమున ♦ నెట్లు నిలుతుం జెపుమా. 182

క. శుకకుల పంకజ సంభవ
సకల పురాణేతిహాస ♦ చాతుర్యకళా
ప్రకటన కుతుకాపాదివి
త్రికాలవేదివి భవన్మ ♦ తికి నెన గలదే. 183

క. వలరాయని దేవియొకో
పలుకుం దొయ్యలియొ కాక ♦ బలరిపు సతియో
జలకేళి కిపుడు వచ్చిన
యలికుంతల తెలుఁగు చెప్పుమని ♦ యడుగుటయుక్. 184

శా. ప్రస్ఫూర్త్యుల్బణ బుద్ధి వైభవ సమ ♦ స్త ద్వీప విన్యస్త రా
జ్యోద్వృత్తి ప్రాపిత భాగధేయు ధన శౌ ♦ ర్యోదగ్ర జన్యాగ్ర సం
ద్రష్టాయోాద పురస్సరః కమల ను ♦ గ్ధాపత్య దైత్య ద్విష
ద్రష్టా స్థాపిత వైరివీర త్రిజగ ♦ ద్రాజ ద్యశోమండలా. 185

క. సాగరకన్యా చంక్రమ
ణాగత పాదారవింద ♦ యావక శుభ దృ
గ్రాగ సలక్షణ లక్షిత
భాగవత విధేయ దాన ♦ పద రాధేయా 186

సుగంధి. పారద ప్రభా విభాసి ♦ భవ్యకీర్తి వాహినీ
పూర దానదూత దివ్య ♦ భూజరత్న కామ ధు
గ్వార యాఱువేల వంశవార్ధి ♦ పూర్ణచంద్రమా
సారబుద్ధి జాలసీత ♦ శత్రుభూమి భృద్భ్రమా. 187

గ ద్య.

ఇది శ్రీమ దఘోర శివాచార్య గురుకరుణా విశేషలబ్ధ సారస్వత
మాదయామాత్య పుత్ర మల్లయ నామధేయ ప్రణీతం
బయిన రాజశేఖర చరిత్రంబను మహాప్రబంధంబునందు
ద్వి తీ యా శ్వా స ము.

శ్రీరస్తు.

# రాజశేఖరచరిత్రము.

(మాదయగారి మల్లన్న ప్రణీతము.)

## తృతీయాశ్వాసము.

క. శ్రీచక్రి చారు కుచయుగ
సూచక గాఢోపగూహ ♦ సూచిత పులక
ప్రాచుర్య తత్త్వతత్పర
యాచక సంస్తుత్య మంత్రి ♦ యప్పామంత్రీ. 1

వ. అవధరింపుము. 2

క. అన్నఁ దదీయోక్తులకున్
మన్నన రాజిల్ల పల్కె ♦ మహీపతితో న
క్కన్నియ తెఱఁగంతయు నే
విన్నప మొనరింతు నే వి ♦ వేక నిధానా. 3

చ. అగునగు నయ్యె యచ్చెలియ ♦ యుట్టిద యొంత నుతింప నంతకున్
దగుఁదగు మర్త్యలోక వని ♦ తా జనతా వినుతాంగి యానన
ద్విగుణిత చంద్రమండల త ♦ దీయ నిశాత కటాక్ష పాతముల్
తగిలిన మారుఁ డెవ్వరి హ ♦ ళాహళి సేయఁడు వాఁడితూపులన్.

ఉ. ఆలతకూన యాకలికి ♦ యామెల జవ్వని యా మిటారి యా
లోల కురంగ శాబక వి ♦ లోచన యా కలకంఠకంఠి యా
బాల రసాల మంజరి నృ ♦ పాలక వంశ వతంస రూప సాం
చాల వయోవిశేషగుణ ♦ సంపద నీక తగుం దలంపగన్. 5

గీ. అవధరింపుము పంచబా ♦ ణావతార
తారతారక హార మం ♦ దారకీర్తి
కీర్తిపాలకుఁడను మహీ ♦ భర్త యేలు
నరుణపురమన నొక్క ♦ పురము వెలయు. 6

సీ. భువనత్రయభ్రాజి ♦ పురరాజి తిలకట్టు
కైటభారి వఘాటి ♦ యాటపట్టు
వేదాదివిద్యలు ♦ విశ్రమించినతావు
విబుధ కోటులపాలి ♦ వేల్పుటావు
పోటుగంటులు దూరి ♦ పోవు శూరులయిక్క
మదవద్విరోధుల ♦ కెమురు చుక్క
నవ నవాకృతి నొప్పు ♦ నవలాల గమికెంకి
వాసనాగరిమ జ ♦ వ్వాది వంకి

గీ. పరిసరోద్యానవాటి కాం ♦ తర సరస్స
రందరస పూర సంతత ♦ మండితంబు
పరిఖ యున్నత సౌభాగ్య ♦ భాగమహిమఁ
బాలమున్నీటి చుట్టు మ ♦ ప్పట్టణంబు. 7

క. అందు ముకుందుఁ డనంగ కుసు
కుంద నిభుండొక్క విప్ర కుంజరుఁడు గలం
డిందు కళామృత శీతల
సందీపిత హృదయుఁ డతఁడు ♦ సౌజన్య నిధీ. 8

మ. అఖిలామ్నాయములుం బఠించి బహుశా ♦ స్త్రాలోచనల్ చేసి బు
ద్ధి ఖలీనోన్నతిఁ జిత్తదుర్మదహయో ♦ ద్రేకంబు వారించి చి
త్సుఖకేళీ పరతంత్రుఁడై గుణగరి ♦ ష్ఠుండై సదాచారమా
ర్గ ఖటూరి శ్రముఁడై యశేష బుధలో ♦ కఖ్యాతిఁగాంచె న్మహిన్. 9

సీ. గ్రాసంబునకుఁ జాలఁ ♦ గాఁ బండు సస్యముల్
మొదపులు పదివైను ♦ పిదుకు నింట

విడిముడి దప్పఁగా ♦ దడిగిన లేఁడు పా
ప్మున లేఁడు సద్వ్యయ ♦ మాచరించుఁ
గలిమిని విఱ్ఱవీ ♦ గఁడు లేమిఁ గుందఁడు
కలపాటి దినములు ♦ గడపి పుచ్చు
దుర్దానములు గొను ♦ త్రోవను బో నొల్లఁ
డాసపాతకుఁడు గాఁ ♦ డీసులేఁడు

గీ. మఱచి తప్పియు నొరులకు ♦ మనసు రాని
పరుష భాషణ లెందైనఁ ♦ బలికి యెఱుఁగఁ
డఖిల జీవదయా పరుఁ ♦ డై తనర్చుఁ
బరమ సాత్త్విక బుద్ధిఁ ద ♦ ద్బ్రాహ్మణుండు. 10

మ. సరసాహారములింటఁ బెట్టి బహు శి ♦ ష్య శ్రేణికిం దెల్పు శా
స్త్ర రహస్యస్థితి చెప్పు నధ్యయన సం ♦ ధ్యల్ హవ్య కవ్యంబులన్
సురకోటిం బితృకోటి నేమఱక ప్రో ♦ చున్ విప్ర వర్గంబులో
సరి లే రెచ్చట నమ్మహాత్మ కనకున్ ♦ సౌజన్య భవ్యోన్నతిన్. 11

క. హింస దెసఁ బోక నరుల ప్ర
శంసకు మది దెరలి పడక ♦ సజ్జన మకుటో
త్తంసుఁడన నతఁడు చేసెన్
సంసారము రీతిగాఁ బ్ర ♦ జల్గొని యాడన్. 12

క. పొరుగింటి విప్రముఖ్యుం
డరుణుండన నొక్కఁ డతని ♦ యట్లన విద్యా
పరిణతుఁడయ్యును జన్మాం
తర వాసన కతన లేమిఁ ♦ దద్దయుఁ బొగులున్. 13

మ. కుల నిర్మూలన కారణంబు ప్రతిభా ♦ కుట్టాక ముద్వేగ కో
పలతాదోహద మార్జవంజవ సుఖ ♦ ప్రత్యూహ మాత్మవ్యథా
జ్వలన జ్వాలిక కామినీ నయన పీ ♦ యూషాత సంరోధి ని
త్య లఘుత్వ క్రియాభూమి లేమి యది యా ♦ హా యేమి గావింపదే.

గీ. పలుచఁగాఁ జూచు నెంతయు ♦ బాధు సమితి
పిలువఁ బిలువంగఁ బలుకరు ♦ బిడ్డలైన
రచ్చ కెక్కెడుమాట గా ♦ రాపు సతియు
లెక్క సేయదు లేమి తూ ♦ లించెనేని. 15

గీ. కష్ట దారిద్ర్య దోషంబు ♦ కతనఁ గాదె
ప్రాభవము దక్కి మును ఋతు ♦ పర్ణ విభుని
వంటవాఁడయి కొల్చెను ♦ వైరసేని
వాసి చెఱుపదె యెంతటి ♦ వారినైన. 16

గీ. అట్లు దారిద్ర్య దోష సం ♦ ప్రాప్తుఁడయ్యుఁ
జిత్తవీధి నొకింతయుఁ ♦ జింతలేక
నియమ పరత నిజాచార ♦ నిరతుఁ డగుచు
నడవఁ దత్కాంత మది నొక్క ♦ నాఁడు విసివి. 17

క. పెనిమిటి యనఘ రాస్యుఁడు
ననభిజ్ఞుఁడు నైన దైవ ♦ మాయని మదిలో
వనరుచు లేమిం బడఁదగు
నినుఁ జెందియు నాకు నింత ♦ నెవ్వగ యగునే. 18

క. మంద జఠరాగ్నిఁ దనయులు
చందత మంగలము వంటి ♦ సంసారము నిం
కొందు గతిలేమ దినదిన
గండం బేరీతి నడపఁ ♦ గాఁ దగు ననఘా. 19

సీ. చదివి నారలు పెక్కు ♦ సంధలఁ గించిత్తుఁ
దప్పకయుండ వే ♦ ద త్రయంబు
పఠియించి నారలు ప్రతిభా ♦ సముస్నిద్ర
సౌష్ఠవంబున మూాల ♦ శాస్త్రవితతి
శోధించి నారలు ♦ శుద్ధమతి స్ఫూర్తి
నఖిల పురాణేతి ♦ హాస సమితి

చూచి నారలు బుధ ♦ స్తోమంబు గొనియాడఁ
గావ్యనాటక ముఖ ♦ గ్రంథసీమ

గీ. యేమిచెప్పెదుదాన మీ ♦ రెడక లేవు
సకలవిద్యలు భూసుర ♦ సమితికెల్ల
నజున కైనవత్తు రిన్నింట ♦ నకట మీర
లల ముకుందుసి కన్న నే ♦ వెలితి చెపుఁడు. 20

క. అతని నడవడి చూడరు
గా తోమర తంపరగుచు ♦ గాదెలఁ గొలుచున్
జేత విడిముడియు బహు గో
ప్రాతంబును గల్గి రాజు ♦ వడువున నుండున్. 21

క. పూచిన తంగెడుగతి వి
ద్యాచతురుండతని సోమి ♦ దమ్మ పౌరువునన్
వాచాల రత్నకంకణ
సూచిత విభవమున మెఱయఁ ♦ జూడంగలనే. 22

వ. అనిన నతం డిట్లనియె. 23

క. కులమునఁబడునో బహువి
ద్యలఁబడునో బుద్ధిఁబడునొ ♦ తరుణీ యేలా
వలవనిదురాశ లెందుం
గలుగదుపో బ్రతుకు పూర్వ ♦ కర్మముదక్కన్. 24

క. పరికి బుద్ధి బలంబులు
కారణములుగావు సువ్వె ♦ కలరె ధరిత్రిన్
నేరిచి బ్రతికిన వారలు
నేరక చెడ్డట్టివారు ♦ నీరజనేత్రా. 25

ఉ. సూదిపిటెందిదారమయి ♦ చొచ్చిన చోటులుచొచ్చి యేరికిం
గాదనరాదు పూర్వకృత ♦ కర్మఫలంబటు గాన నేల ని

ర్వదనఁబొందె దిప్పుడలి ♦ వేణి తపంబొనరించి యేమ ల
క్ష్మీద్రదయిత ప్రసాదమునఁ ♦ జెందెదఁ దాపక చింతితార్థముల్. 26

సీ. జగదభి నిర్మాణ ♦ చాతుర్య విఖ్యాతి
మెచ్చిదాతకు నెవ్వ ♦ రిచ్చినారు
స్వర్లోకపావన ♦ సౌభాగ్య గరిమంబు
మెచ్చి యింద్రునకెవ్వ ♦ రిచ్చినారు
దృగ్విధాగోచర ♦ దివ్యతేజస్ఫూర్తి
మెచ్చిభానునకెవ్వ ♦ రిచ్చినారు
సకలక్షమాధృత ♦ క్షమసత్వ సంపత్తి
మెచ్చి శేషునకెవ్వ ♦ రిచ్చినారు

గీ. విష్ణుకరుణా విశేషంబు ♦ విశ్వమునకుఁ
గారణముగాక మఱియేది ♦ కలదు దిక్కు
కాన నరలేనిభక్తి నో ♦ కంబుకంఠి
మనలఁగొల్చిన మనుపఁడే ♦ మదనగురుఁడు. 27

మ. తరుణీరత్నము లేమిఁదొడ్డ మదమా ♦ ద్దంతి యూథంబు లే
యరుదత్యున్నత భోగభాగ్య విభవ ♦ వ్యాపార మేలెక్క సా
గర సంవేల్లిత విశ్వ భూభువన ర ♦ క్షాశక్తి యేబ్రాఁతి శ్రీ
హరిసేవాపరులైన పుణ్యులకుఁ గాం ♦ తా యేల చింతిల్లగన్. 28

మహాస్రగ్ధర.

కొలుతుం దేవాది దేవుం ♦ గువలయసుషమా ♦ గుచ్ఛసచ్ఛాయకాయుం
గలశాంభోరాశి కన్యా ♦ కచభర విచర ♦ త్కఞ్జము హస్తారవిందుం
బలి విధ్వంసిం దపస్వి ♦ ప్రకర సుఖకర ♦ ప్రౌఢకారుణ్యాలోలున్.
జలశాయిం జక్రి పాణిం ♦ జగదవనపరుం ♦ జంభసంభేది వంద్యుం. 29

వ. అని వితర్కించి. 30

క. విమలాచారుం డతిరతి
శమయుతుఁడయి తపము సలుపఁ ♦ జనియెన్ లక్ష్మీ

రమణాధీన మనోగతి
యమరాడను జన్మయైన ♦ యమునా నదికిన్. 31

క. అన్నది పావనగుణ సం
పన్నత నుతియింపఁ గలఁడె ♦ పన్నగ పతియున్
మిన్నక యున్నది మునిఁగిన
యన్నరుఁ డమ్మరుని తండ్రి ♦ యనఁ దగుఁ బెరిమన్. 32

మ. జటిసంఘాత సమీప సంఘటిత ర ♦ జ్యద్వాలుకా లింగ సం
స్ఫుటముల్ జన్మ పరంప రాఘలతికా ♦ మూలచ్ఛిదాపాదనో
ద్భటముల్ ముక్తివధూకుచాగ్ర పటముల్ ♦ భాస్వత్తనూ సంభవా
తటముల్ వానికడ న్వసించు నరుచెం ♦ తం జేరవే చింతలున్. 33

ఉ. దీపితభక్తి నన్నది ను ♦ తించు మహాత్ములఁ జూతురేని యీ
కాపనిగాదు దైత్యకుల ♦ ఘస్మరశాత కఠోర చక్రధా
రా పటు పాతవేగమున ♦ వ్రయ్య లగుం దల లంచు బుద్ధిగా
నా పితృభర్త చెప్పునఁట ♦ యాత్మ భయంకర కింకరాళికిన్. 34

మ. మగఁ డెవ్వారలఁ బ్రోచువారు సతికిన్ ♦ మాన్యుల్ గదా యంచు లో
నగముల్ వారిధి మాడ్కిఁ దాఁచె ననఁగా ♦ నైదాఘవేళాత ప
ద్విగుణీభూత తనూవిదాహ మడఁపన్ ♦ వేవచ్చి తత్కూలముల్
డిగి లీలన్విహరించుఁ దీరవన వా ♦ టిన్ దంతి సంతానముల్. 35

వ. అట్లు సకలగుణ తరంగిత యగు నత్తరంగిణిం గనుంగొని యవ్విప్ర పుంగవుండు పులకితాంతరంగుండగుచు నిట్లనియె. 36

క. ముల్లోకముఁ బావన సం
పల్లీలల మనుచునట్టి ♦ మహిమలుగాంగా
కల్లోలినికిం గలుగుట
తల్లీ కాళింది నీక♦తంబునఁ గాదే. 37

శా. సారాచారు లశేష భూభువన ర ♦ క్షా దక్షు లజ్ఞానసా
ఘోరాకారు లశేషభవ్య సుషమా ♦ నూర్జాంశు లర్థార్థి మం

దారుల్ తొంటి భవంబులం దొసఁగు లెం దగు హేమభూమి నుండు రాకుమార్తె
వారిం గ్రుంకిన వారి వారలఁట కా ♦ వాస్తి గ్రీఁ జేయుంభావుకా. 38

శా. శ్రీపుల్లామర చూలి చందమున సం ♦ క్రీడించి మధ్యాహ్న వే
ళా పూర్తిం గన కావనీశుని ♦ ధను ♦ ర్నాలిత్యము ల్చూపి తా
మాపుల్మాధవ లీలల న్వెలయు న ♦ మ్మార్తాండుఁ డోయమ్మ ని
న్నేపుణ్యంబునఁ గాంచెనో యతని పెం ♦ పింకేమనం బావసి. 39

లయగ్రాహి.

జాలుకొనిమించు నెఱ ♦ డాలు గలజాతి హరి
నీలముల నేలుకొనఁ ♦ జాలెడు భవత్క
ల్లోలములు భక్తజన ♦ లోలములు పాప వన
కీలములు మోక్షపద ♦ మూలముల తత్త
ద్భాలిక జన ప్రకర ♦ ఫాల తలపద్మజ స
మాలిఖిత దుష్ట లిపి ♦ తూలపటలీ వా
తూలములు పుణ్య గుణ ♦ శీలములు సంస్తవక
కేళి పరతంత్రములు లీల నటియింపన్. 40

వ. ఇట్లు బహువిధంబులఁ దన్మహా నది నభినందించి కృతస్నానుండై సమా
కుంచిత పంచేంద్రియుండగుచుఁ బంచాగ్ని మధ్యంబున నిలిచి హరిని
గురించి తపంబాచరించు తఱి నొక్కనాఁడు. 41

సీ. పుష్పవతీ నామ ♦ పుటభేదనం బేలు
నందకాఖ్యాన గం ♦ ధర్వ నృపతి
గారాపుఁ గూతురు ♦ కాముని దా చిల్క
లతయను పేరి బా ♦ లయు మహేంద్ర
నగరాధి నాయకుం ♦ డగు చిత్ర వాహనా
హ్వయయువుఁ బరగెడు ♦ యక్షభర్త
కనుఁగుఁ దనూభవ ♦ కనకమంజరి యను
కన్నియ జలకేళి ♦ కా కుతూహ

గీ. లమునా యమునా నదీ తీర ♦ లలిత ఫలిత
కాననాంతర సీమకుఁ ♦ గదలిపోయి
కాంత లిద్దఱు నచ్చట ♦ గలసి మెలసి
సంభ్రమంబునఁ బుష్పాప ♦ చయ మొనర్చె. 42

గీ. వార లిరువురు నవ్వేళ ♦ వచ్చి చెంతఁ
జిగురుటాకుల మెఱుపునఁ ♦ దగిలియున్న
యొక్క మంజరిఁ జూచి యొం ♦ డొరులఁ గడవఁ
బాఱి యౌవన గర్వసం ♦ పదల కతన. 43

క. ఇవ్విరి నాయది యనఁగా
నవ్వలియది తనది యనఁగ ♦ నది హేతువుగాఁ
గ్రొవ్విరి కొఱకై యిద్దఱు
జవ్వనులకు మాట మాట ♦ జగడం బగుటన్. 44

క. తొల తొలఁగు తొలఁగు మనుచుం
దల తల తల మనుచు నట్టి ♦ దట్టితనంబుల్
వలదు వల దనుచుఁ బల్కఁగఁ
గల కంఠుల కపుడు మిగులఁ ♦ గలహము ముదురన్. 45

ఉ. కొప్పులు వీడఁగా బిగువు ♦ గుబ్బలు పల్మరు జారఁ బయ్యెదల్
గప్పుచు రత్న కంకణ ఝు ♦ ళం ఝుళ నాదము మించ హస్తముల్
ద్రిప్పుచుఁ గొను దీఁగెలు చ ♦ లింపగ వేచని తోడివారితోఁ
జెప్పుచు సద్ది రాయనుచుఁ ♦ జిట్టలు మీటుచు సందడింపుచున్. 46

క. అయ్యిరువురిలో లతయను
తొయ్యలి కప్పువ్వు ♦ గుత్తి దొరకిన కతనన్
గయ్యమునకుఁ గాల్ద్రివ్వుచు
గయ్యాళి తనంబు మీఱఁ ♦ గా నిట్లనియెన్. 47

క. తగవెఱుఁగవు నగవెఱుఁగవు
మొగమోటయు లేదుకొమ్మ ♦ మున్నుగ నాచేఁ

దగిలిన విరి నాకిమ్మని
తగిలెదవో వెఱ్ఱిపట్టి ♦ తహ తహవలదే. 48

ఉ. రక్కసమూటలేల నగ ♦ రా తగు వారలు నోరు నొవ్వదే
డక్కనె యొద్ద సొమ్ములు ప ♦ డంతుక యెంత యలంత నొందినన్
నిక్కము నీల్గుచుం బలుక ♦ నేర్చిన నీ విటమున్న తీఁగపై
నిక్కసుమంబు గోయుటకు ♦ నేటికి నేరకయుంటి చెప్పుమా. 49

క. కామిని వాదులు గొఱగా
వేమిటి కని యూరకున్న ♦ నెఱుఁగవు నన్నున్
వేమఱు నొత్తుకు వచ్చెద
వేమిట నా తోడఁ బోలు ♦ దే యిటుఁ జెపుమా. 50

ఉ. అన్నఁదదీయ వాక్యముల ♦ కామృగలోచన పల్కె రూపసం
పన్నతకుం గులంబునకుఁ ♦ బాఱకు నలుగురు మెచ్చనాకు మో
క న్నియ నన్ను నిన్నును జ ♦ గంబెఱుఁగున్ మునుమున్న కన్ననా
కొన్నిన నాకు నిమ్ము మఱి ♦ రూపుకొలందులు గాన నయ్యెడన్.

ఉ. వీరిఁడి మాటలేల విన ♦ వే యలవాఁడె కళిందకన్యకా
తీరమునన్ వసించి యతి ♦ తీవ్ర తపం బొనరించు మా నికం
తీరవమున్ గరంచునది ♦ నేర్పు విలాసము పేర్మి నేటికిం
బోరఁగ స ప్డు కానఁబడుఁ ♦ బో మన యిద్దఱ తారతమ్యముల్. 52

క. ఒసపరి మాటలఁ బాటల
నసమాన తపో నిరూఢుఁ ♦ డగు నమ్మౌనిం
గుసుమాస్త్ర బాణవశ మా
నసుఁ జేయుట యిపుడు నీకొ ♦ నాకో చెపుమా. 53

చ. అనవిని యామృగాక్షి దర ♦ హాసము మోమున నంకురింప యౌ
వన భరరూప సంపదల ♦ వన్నెకు నెక్కుటఁ జేసె యిట్లు తా
మును కలుగంగ నియ్యకొన ♦ ముద్దు నడచ్ మదభద్రదంతినాఁ
గనుఁగొన దాళధళ్యములు ♦ కన్గొందుకొనం జని తన్నదీస్థలిన్. 54

మ. కటిశాటీ భవదేణ కృత్తితను జా ♦ గ్రన్నాసికాగ్ర దృ
క్పుటి లాలాట సమర్పి తాంజలి రమాం ♦ భోజాన నానాయకో
త్కట సిధ్యాన సుధా ధునీ లహరి మ ♦ గ్న స్వాచ్ఛనిర్ణిద్ర హృ
త్పుటి సద్దివ్య మహానుభావ జటిరా జెం ♦ తం జేరె లీలాగతిన్. 55

ఉ. ఆడుచుఁ బాడుచున్ సరస ♦ మాడుచు మోహనలీల గ్రాలన
చ్చేడియ చెయ్వు లెల్ల ముని ♦ సింహము కన్గొని యుప్పు డద్దిరా
యోడకవచ్చి నా యెదుర ♦ నూరక క్రేళలెడు దీని మత్క్రుధా
బాడబ కీలల న్దలంచి ♦ పాటంగ వైచెద నంచు నుగ్రుఁడై 56

మత్తకోకిల.

బాల యౌవన గర్వరేఖఁ బి ♦ సాళ మాడెదవేల నా
మ్రోల నెవ్వరిఁగాఁ దలంచితి ♦ మోహసాల సమూహ ని
ర్మూలన క్రమశాలిఁ జక్రధ ♦ రున్ భజించు కృతార్థుఁడన్
జాలుఁ జాలుఁ బో కాలు పుట్టు ర ♦ సాతలంబున నుర్వివై. 57

క. అని ముని శపియించిన నె
మ్మనమున విభ్రాంతి నొంది ♦ మారుత సంచా
లన చలిత ♦ కలిత లత యన
ఘనభీతి లతావధూటి ♦ గజ గజ వడఁకెన్. 58

క. అదిగని కార్యము దప్పెన్
బోదఁడు పోదం డనుచు నింగి ♦ బోటులు మునిరా
ట్పద పద్మ వినతు లొనరిచి
మృదుమధురాలాప సరణిఁ ♦ గృప దళుకొత్తన్. 59

మ. కినుకన్ మీరొకయింత చూచినఁ ద్రిలో ♦ కీ లోక సంచారముల్
పొనుఁగై పోవె భవన్మహా మహిమకున్ ♦ బూఁబోండ్లు లక్ష్యంబె యి
వ్వనితన్ దీన ననాథఁ గావఁ గదవే ♦ వాత్సల్య సంసిద్ధి నో
వనజాతోదర జాత ధీ విభవ యో ♦ వాచంయమి గ్రామణీ. 60

సీ. అనిన నమ్మౌని బలికె ద ♦ యాళుఁ డగుచుఁ
గమల ముఖులార వాడు వా ♦ క్యములు తప్పు

వైనఁ గానిండు మున్నొక్క ♦ యక్షవరుఁడు
కంబుఁ డనువాఁ డొకానొక ♦ కారణమున. 61

ఉ. సైంధవ నామదేశనృప ♦ సన్మథు గర్భమునన్ జనించి సౌ
గంధిక బంధువంశ కలి ♦ కామధు మాన విలాసినియై సుధా
సింధు సబంధు బంధుర వ ♦ శీకృత కీర్తి ధునీ పరిపూర్తియై
సింధుఁడు నాఁగ రాజకుల ♦ శేఖరుఁ డొ సుతుఁ గాంచె నంతయున్.

క. ఆ రాజకులోత్తంస కు
మారికయై యిది జనించి ♦ మహనీయ కళా
శ్రీరంజిత యగుఁ బొండన
వారిజ లోచనలు కొంత ♦ వగ దిరుగుటయున్. 63

ఉ. రామలు కేలికానన ధ ♦ రాస్థలికిన్ మును క్రీడ సల్ప రా
రో మన సారఁ గమ్మని వి ♦ రుల్ దమ నేర్పులఁ గోసికొంచుఁ బో
రో మదవృత్తి నేగత మ ♦ రుల్గొని పోరిన వారిఁ గాన మొం
డే మనువారమమ్మ తర ♦ లేక్షణ వాంఛిత ఫలం బిటుండఁగన్. 64

క. అని పలికి యమ్ముని పతికిఁ
బ్రణామములఁ దగ నొనర్చి ♦ రాజీవ ముఖుల్
చని రిట లతావధూటియుఁ
బ్రియు తయశ్శ కంధి సింధు ♦ పతి కుదయించెన్. 65

సీ. ఆ సింధుపతిసుతలు ♦ నవని మండల మిది
యతని పట్టణ భర్మ ♦ హర్మ్యవీధి
నభ్రంకషంబులై ♦ యాడెడుఁ గేతన
పల్లవంబులు చూడు ♦ మల్ల యవిగో
చేరువ కిప్పుడు వ ♦ చ్చిన కాంతి మతియను
తలిరాకుబోఁడి యీ ♦ సు లలితాంగి
యూపుష్పఁదోట యీ ♦ యిందీవరేక్షణ
క్రీడసల్పెడు నట్టి ♦ కేలి వనము

గీ. మహిత మధు మాసమగుట ♦ నమ్మంద గమన
ఖేలులఁ దాను విహారంబు ♦ సలుప వచ్చి
పోవుచున్నది నిజపురం ♦ బునకు మగిడి
మత్తగజ గామినీ జన ♦ చిత్తచోర. 6౦

క. లేకున్న నింత చక్కని
కోక స్తని కోమలాంగి ♦ కువలయ సుషమా
లోకమునఁ గలదె మానవ
లోకంబున నిఖిల రాజ ♦ లోక వతంసా.

మ. వనితారత్నము మోము భ్రూవిలసన ♦ వ్యాపారముల్ వక్రము
ద్ర నిరూపింపఁగ నప్రమాణగతి నే ♦ త్రంబుల్ పచారింప నీ
సునఁ దర్కింపఁ గడంగి వచ్చు ద్విజరా ♦ జున్ నిగ్రహస్థానయు
క్తునిగాఁ జేసి చెలంగు నప్రతిభ ♦ చేఁ గ్రొత్త ల్వితర్కింపఁగన్. 68

క. తరుణి యొలకొను మదకే
సరి సన్నిభమై బల ప్ర ♦ సన్నత గనియుఁ
గురుకుచ భార వహస్థితిఁ
బరఁగియు నిరుపేదతనము ♦ పాయదు కంటే. 69

గీ. అంగ లతికా విలాసంబు ♦ వాచరించు
యౌవనామృతవృష్టి సం ♦ ప్రాప్తి కొఱకు
లలిత నాభీ బిలంబు వె ♦ ల్వడిన యట్టి
చీమ చాలనఁ జాలుఁ ద ♦ ద్రోమరాజి. 70

క. మును పరమ హంస వాసనఁ
బనివడి సామీప్యపదవిఁ ♦ బంకేరుహముల్
గనియెనో యనఁ గా వరవ
ర్ణిని పాదయుగంబు పద్మ ♦ రేఖం బొలుచున్. 71

చ. కవిత సుధారసంబు తొలు ♦ కన్ సరస ప్రియభాషణంబులన్
బలికిన శీతకాలమగుఁ ♦ బల్లవపాదము లెత్తి లీలమై

మొలఁగ వసంత కాలమగుఁ ♦ మించు కనుంగవఁ బాఱఁ జూచినన్
దలకొను కాఱు కాలమగుఁ ♦ దన్వి విలాసము చిత్ర మెన్నఁగన్. 72

ఉ. వ్రీడ దొలంగి యాహరి వి ♦ రించి ముఖుల్ భ్రమకొంది గుట్టు పో
వాడరొ పంచ సాయక శ ♦ రాహతి పొల్పడి పుష్పఁ బాన్పులన్
వాడరొ చంద్ర చంద్రికల ♦ వంకఁ గనుంగొన నోడరో తగన్
జూడరు గాక యక్కలికి ♦ చూపుల బాల కురంగ లోచనల్. 73

చ. ప్రచుర వివేకసార యల ♦ బాలిక నేమని చెప్ప నాఁడని వా
క్రచనలు గావు మే నమరుఁ ♦ గల్పకవల్లి మతల్లి తల్లియై
కచనిచయంబు పొల్పమరుఁ ♦ గార్కొను తుమ్మెద చాయ చాయయై
కుచలికుచంబు లిం పెసఁగుఁ ♦ గ్రొవ్విరి బంతుల మేలిబంతులై. 74

ఉ. అచ్చెరుగాఁకు బోఁడి నవ ♦ యావన రూపవిలాస రేఖ నీ
విచ్చటఁ గంటి నంటి వది ♦ యెంతయుఁ గల్ల యొకింత జూచినన్
బచ్చని వింటివాఁడు తెగఁ ♦ బాఱక నిన్నిపుడింత దవ్వరా
నిచ్చునె రాజశేఖర న ♦ రేశ్వర యంచు శుకంబు పల్కినన్. 75

గీ. పార్థివాగ్రణి సంతోష ♦ భరితుఁ డగుచు
నవ్విలాసిని తెఱఁగెల్ల ♦ నాను పూర్వఁ
దెలిసి యీ రీతిఁ బల్కె నే ♦ ర్పులు శుకేంద్ర
నీకుఁ బుస్తక పాణికిఁ ♦ గాక కలవె.

ఉ. కంటిఁ దపో విశేషమునఁ ♦ గన్నుల పండువగాఁ దలోదరిన్
వింటి భవద్వచో రచన ♦ వీనులు చల్లఁగ దద్గుణాళి పూ
వింటి యతండు నన్ గినిసి ♦ వెంపరలాడక మున్నె యల్ల వా
ల్గంటి మనోజ్ఞ సంగమ సు ♦ ఖ స్థితి యేగతిఁ గల్గు జెప్పదే. 77

ఉ. చంచలనేత్ర సోఁపునెడ ♦ సన్నపు బయ్యెదకొంగు జాఱఁ గాం
క్షించుటెగాని చన్నుఁగవ ♦ కేవలఁ బ్రోఁపులు గట్టియున్న క్రొ
మ్మించుల నాను చూడ్కి మిఱు ♦ మిట్లు గొనం గనరాకపోయె నో
క్కించుక యేని తద్గరిమ ♦ యెట్లు భరింపును నిచ్చ నెచ్చెలీ. 78

ఉ. కంగిన పైఁడి కుండల వ ♦ కావకలైచనఁ జేయఁ జాలు చ
న్నుంగవ ప్రేగుసం దస త ♦ నూలత యల్లలనాడఁ దేట వా
లుంగనుదోయి చూపులు త ♦ ళుక్కున నల్లన వచ్చినన్ దృఢా
లింగన మాచరించ కవ ♦ లీఢమనోవ్యథమాన నేర్చునే. 79

సీ. బలువిడి నేతెంచి ♦ వలరాచ బెబ్బులి
వాఁడితూపుల ద్రోళ్ళ ♦ వచ్చెనేని
మెలమావికొనయెక్కి ♦ పెళ పెళ నార్చి కో
వెలపోటుఁ గూఁతలు ♦ పెట్టెనేని
బడిబడిఁ గమ్మ పు ♦ ప్పొడి నిప్పుకలు చల్లి
వెడవెడగా గాలి ♦ సుడిసెనేని
దేనియల్ద్రోలి మ ♦ త్తిలి గండుఁ దుమ్మెద
కెరలి జుమ్మంచు జం ♦ కించేనేని

గీ. బాడబ జ్వాలికలతోడఁ ♦ గూడిమాడి
వచ్చి వెన్నెల తేట కా ♦ ర్చిచ్చు బలిసి
యిట్లలంబుగఁ బైఁ జుట్టు ♦ ముట్టెనేని
పాంథులక్కట యేరీతి ♦ బ్రతుకువారు.

వ. అని పలుకుచు నమ్మాళవపతి మానినీ విలాసాపహృతమానధనుండై
మనోభవాధీనమానసుండగుచు నుండె నంత నిచ్చట. 81

చ. వెడవెడజారునీవి యర ♦ వీడిన పెన్నెఱి గొప్ప నెన్నడం
దడఁబడు పాదపద్మములు ♦ దారిన కన్గవ చూపులోరమై
బడిబడి వెళ్ళు నూర్పుగమి ♦ పయ్యెద యొయ్యెన జాఱఁగా బయల్
పడు చనుగుబ్బలుం గల వి ♦ లాసిని చందముఁ జూచి నెచ్చెలుల్

చ. గుజగుజలాడ వారిఁ గను ♦ గోవల బిట్టదలంచి ప్రౌఢ వా
రిజముఖి యోర్తు చూచి సతి ♦ ప్రేమభరంబు మరల్పరాదు బే
రజపు లతాంతబాణుఁడు క ♦ రస్థిత పల్లవ ఖడ్గధారచే
గజిబిజిచేసెనేని మఱి ♦ కార్యము దప్పునటంచు గొబ్బునన్. 83

క. ఆ రాజన్యు పురంబును
బేరును వంశంబు నతని ♦ పెంపును దెలియం
గోరి వివేకిని యగు న
వ్వారిజముఖి తల్లి తా ని ♦ వాసంబునకున్. 84

క. వచ్చి తమ కాంతిమతిపైఁ
జెచ్చెర మరుఁడేసినట్టి ♦ చిచ్చుటకోలల్
తెచ్చినగతిఁ జెంగలువల
కచ్చు నృపాగ్రణికి దెచ్చి ♦ కానుక యిచ్చెన్. 85

ఉ. ఇచ్చి తదీయమూర్తిఁ గని ♦ యెంతయు నచ్చెరు వావహిల్లఁగా
మెచ్చి కుమార మన్మథ య ♦ మేయగుణాకర నేఁడు కొత్తగా
నిచ్చటి కేగుదేర గత ♦ మెయ్యది దేవరపేరు వేఁడ నా
కిచ్చ భయంబు పుట్టెడు న ♦ హీన మహామహిమంబు చూచినన్.

ఉ. ఇంతకుమున్న లీలమెయి ♦ నిచ్చటికిం జనుదెంచి సింధు భూ
కాంతుని కూర్మిపట్టియగు ♦ కాంతిమతీసతి నిన్నుఁ జూచి య
త్యంత మనోనురాగదశ ♦ నాఁటిడిఁ బొందుచు దావకీన వృ
త్తాంత మెఱుంగ నన్ను వసు ♦ ధావర నీకడ కంపె వేడుకన్. 87

చ. అనిన నతండు లేఁతనగ ♦ వాననమందు నిగుర్పఁ గీరముం
గనుగొనినన్ మహీధవశి ♦ ఖామణితో నది పల్కె నేర్పునన్
మనుజకులాధినాథ యొక ♦ నాఁటొక యించుకమాత్రఁ నిన్ను జూ
చిన చిగురాకుఁబోఁడి తమిఁ ♦ జిక్కెడొ యప్పుడనీకు దక్కెడో. 88

చ. మనుకులచంద్ర నీదు సుకు ♦ మార మనోహరమూర్తి చూచి యే
చిన తమిఁ జిక్కి చిక్కి నిజ ♦ సీమకు నీవిటఁబోకమున్న యి
వ్వనమున నున్నవేళనె భ ♦ వచ్చరితం బెఱుఁగం దలంచి తాఁ
బనిచిన దీ వధూటి నల ♦ బాల వివేకము మెచ్చ జెల్లదే. 89

క. అల సింధు భూమిపాలక
తిలకాత్మజ కెల్లవిధముఁ ♦ దేటపడంగా

చెలిపి యిటఁ దోడి తెచ్చెదఁ
బలుకులు వేయేల నన్నుఁ ♦ బంపు కుమారా. 90

వ. అనిన శుకవల్లభునకు భూతల వల్లభుం డిట్లనియె. 91

క. నీ కొలఁది నలువరాణికిఁ
గా కొరులకు నెట్లు తెలియఁ ♦ గా వలఁదు ననఘ
లోకమున నెవ్వమైనను
నీకు నసాధ్యములు గలవె ♦ నిర్మల హృదయా. 92

క. నినుఁ బాసి యొంటి నే నీ
వనమున నిలుపోపఁజాల ♦ వనితామణికిన్
మనల నెఱిఁగించి రమ్మా
యనఘా! కను సెప్ప వేయు ♦ నంతటిలోనన్. 93

ఉత్సాహ. అనుచుఁ బల్కి యల్కుచెని ♦ యవనినాథ వర్యుఁ డ
వ్వనిత చేతి కిచ్చి కీర ♦ వరుఁడు మంజులోక్తి మీ
గనుఁగుబోటితోడఁ జెప్పు ♦ నపుగబడ్డ పద్ధతుల్
చను మటన్న సంభ్రమించి ♦ జలజనేత్ర పోవునన్. 94

ఉ. అంతకుమున్న కాంతిమతి ♦ యాత్మపురంబున కేగి యొక్క యే
కాంత విహారసౌధమున ♦ నాత్మ సఖీజనుల న్మొఱంగి సం
క్రాంత దృఢానురాగము వి ♦ గాఢముగా నిలుపోవ కమ్మహీ
కాంతు మనోజ్ఞరూప గుణ ♦ గౌరవముల్ మదిలోఁ దలంపుచున్.

క. తరుణులు తఱుములు పెట్టుచు
సరగునఁ దోతేరఁ దెలియఁ ♦ జాలిన మతిఁ ద
త్పురమును బేరు నెఱింగినఁ
బరితాపము కొంత డిందు ♦ పడదే నాకున్. 96

సీ. అక్కుమారకుని నిం ♦ కొక్కమా రెదిరించి
కన్నులారఁగఁ జూడఁ ♦ గలుగునొక్కొ

యారాజసర్వజ్ఞు ♦ నభిరామ గుణములు
వీనులు చల్లఁగా ♦ వినుదు నొక్కొ
యామానినీ మన్మ ♦ థాకారు బిగి యారు
కౌఁగిట నుండంగఁ ♦ గాంతు నొక్కొ
యామేరు నగధీరు ♦ తోఁ ముచ్చటలు దీఱ
సరస సల్లాపంబు ♦ దొరకు నొక్కొ

గీ. యాకళా పూర్ణిమాచంద్రు ♦ నా సమగ్ర
భోగదేవేంద్రు వరియించి ♦ పొంది పొసఁగి
కొలఁది యిడరాని కోర్కులఁ ♦ గలిసి మెలసి
నిలువఁ గలుగుట యది జన్మ ♦ ఫలము గాదె. 97

ఉ. అవ్వల నుండునో కడచి ♦ యప్ప్రభుఁ డవ్వలి కెంకుఁ బోవునో
యెవ్వరిఁ బంపుదున్ దెలియ ♦ హెచ్చిన మచ్చిక పిచ్చలింపఁగా
నెవ్విధి నిల్పు దాన మది ♦ నెట్టు భరింపుదు నిప్పటిల్లు నీ
నెవ్వగ నెవ్వగం గడవ ♦ నేరుతు నెద్దియు పాయ మింకిటన్. 98

చ. చెలులకు నామనోరథము ♦ చెప్పిన నేమని గేలిఁ బుత్తురో
తలఁకెడు నామనంబుఁ గని ♦ తల్లియుఁ దండ్రియు బుద్ధి నేమిగాఁ
దలఁతురొ రాజకన్యకల ♦ ధర్మము గాదిది యంచు బాధువుల్
పలుచన గాఁగఁ జూతు రొకొ ♦ పాయపుఁ గోరిక లేమిచేయుకున్.

చ. తలఁపున నాథునిం గలసి ♦ తా నది నిక్కముగాఁ దలంచి మిం
చులఁ దులకించు మోవిపయి ♦ సోఁకిన కెంపులు గప్పి పుచ్చెనె
చ్చెలి మఱుపెట్టగాఁ దలచి ♦ చిత్రగతాబ్జము మూర్కొనంగ ని
చ్చలు గుఱిచేయు నవ్వికచ ♦ సారస లోచన ప్రేమమే మనన్. 100

క. అమ్మాడ్కి నేకతంబున
నమ్మలికం బొగులుచున్న ♦ యువిదంగని యో
యమ్మ యిది మిగులఁ గ్రొత్తలు
పొమ్మని వెఱఁగంది యపుడు ♦ బోఁటులు తమలోఁ. 101

ఉ. కంటిరె యమ్మలార యవ • గాఢము దీని వియోగ వహ్నిదా
ర్వెంటఁ దొలంగి పోవలయుఁ • గ్రేవగనక్క వలవంత లింకనే
వెంట భరింపవచ్చు మన • వీరిఁడి బుద్ధులనేమి చెప్ప న
ట్లొంటి వసించి యున్న పతి • యూరును బేరు నెఱుంగఁ బోలదే

ఉ. ఎచ్చట నుండి వచ్చె నిపు • డో మధుమాసము వచ్చుఁ గాక మా
కిచ్చ వసీ విహారము న • కిప్పుడ యేటికిఁ బుట్టెఁ బుట్టెఁగా
కచ్చటి కప్పు డన్నరవ • రాగ్రణి రాఁగతమేమి యింతలోఁ
బచ్చని వింటివాఁ డొక నె • పంబిడి కత్తులు నూరనేటికిన్. 103

సీ. విరహ పన్నగ ఫణా • విహారణంబున వేఁడి
యూర్పులఁ బయ్యెద • యొయ్యఁగదల
ననురాగ జలధి సం • జనిత ఫేనచ్ఛాయ
లనమేని వెలిచాయ • లతిశయిల్ల
గాఢచింతా లతా • కలికా కదంబకం
బనఘర్మ కణ జాల • మంకురింప
నురు మోహతిమిర ఖ • ద్యోతంబు లనఁగాకఁ
బెట్టు కుంకుమలేర్చి • బేఁటులెగయఁ

గీ. గుటిల కుంతలి యున్న యి • ప్పటి తెఱంగు
ప్రాణపదమైన మనకుఁ జె • ప్పంగనేల
చాల నట్టింటి పగయైన • శంబరారి
యట్టివానికి మన దయ • పుట్టకున్నె. 104

వ. అని చేరం జనుదెంచి

సీ. కలికి రాచిలుకఁ జె • క్కిలి నొక్కి యూఱార్చి
ముద్దాడ వేటికి • ముద్దులాడి
పసిఁడి వీణియగూర్చి • పంచమ శ్రుతిమించ
మ్రోయింపవేటికి • మోహనాంగి
నీలాలుగప్పు పె • న్నెఱికొప్పు నొప్పుగాఁ
గీల్కొల్పవేటికిఁ • గేకియాన

గొనబుగాఁ దిలకంబుఁ ♦ గొనగోరఁ దీర్చి య
ద్దము చూడ వేటికిఁ ♦ దలిరుఁబోఁడి

గీ. ప్రోది రాయంచ రమ్మని ♦ బుజ్జగించి
యాటనేర్ప వదేటికి ♦ నంబుజాక్షి
మారువేదనఁ దెరలెడి ♦ వారిఁ దెగడు
నీకు నీరీతిఁ జెల్లునే ♦ నీలవేణి. 106

క. అని పలికి కలికి తొయ్యలి
తను సంతాపంబు వాపఁ ♦ దలఁచి విసవిస్కా
జని బిసవిసరముఁ జిగురులు
ననలుం బువ్వొళ్ళుఁ దెచ్చి ♦ నైపుణి మెఱయన్. 107

క. అజ్జలజపత్ర నేత్రలు
గొజ్జఁగి నీ రుప్పతిల్లఁ ♦ గులికిన విరివ్రా
సజ్జపయిఁ దార్చునప్పుడు
లజ్జావతి వాడి యొరగు ♦ లతయనఁ జరఁగెన్. 108

క. తరుణి నట ఁదార్చి పై పై
నరవిరులం గ్రుమ్మరించి ♦ రంగనలు రతీ
శ్వర మధుర ధను ర్నిరద
కరకా కాంతముఁ లభంగిఁ ♦ గానం బడఁగన్. 109

సీ. చెంగావి గట్టె నె ♦ చ్చెలియోర్తు మానంపు
రవిగ్రుంకనగు సాంధ్య ♦ రాగమనఁగఁ
గర్పూర రజమొక ♦ కాంతచల్లె వియోగ
దహన మహార్చి ♦ మహిమ యనఁగఁ
గలువలు కన్నుల ♦ కలఁదియొత్తె నొకర్తు
ప్రాణవాయువు లోని ♦ కడఁచె ననఁగ
బొండుమల్లియ లొక ♦ పొలఁతి రాశిగఁబోసె
నంగజ భూతోప ♦ హారమనఁగ

గీ. సబల కిరీతి శిశిర కృ ♦ త్యము లొనర్ప
సంతకంతకు సంతాప ♦ మావహిల్లఁ
జెలులు కనుఁగొని తమలోన ♦ నల బలంబు
బుడిగి నివ్వెఱగంద నం ♦ దొర్తు చూచి. 110

సీ. చిగురాకులే కత్తు ♦ లగు నేని నింతకు
దగర కోయిలనోరు ♦ దెగక యున్నె
యలరు దేనియ వేఁడి ♦ యగు నేని నింతకుఁ
గండుఁ దుమ్మెదముక్కు ♦ కమలకున్నె
యర విరులే నిప్పు ♦ లగు నేని నింతకుఁ
బూవిల్తు నఱచేయి ♦ పొక్కకున్నె
యసదు గాలియె వెట్ట ♦ యగు నేని నింతకుఁ
గమలవనం బెల్లఁ ♦ గ్రాఁగకున్నె

గీ. భామ యేటికిఁ జిగురుకై ♦ వాఁచ బాఱ
వనిత యేటికి దేనెకై ♦ వడియఁ బాఱ
వెలఁది యేటికి ననలకై ♦ వెల్లఁ బాఱఁ
బాలతిఁ యేటికి సురటి గా ♦ డ్పులకుఁ బాఱ. 111

క. పెదపెద మాటల నిప్పగి
ది దొడ్డ కలకలముగాఁగ ♦ దేవేరియుఁ దా
నిది యెయ్యదియో చూతుమ
పద మనుచుం జేర సింధు ♦ పతి వచ్చుటయున్. 112

క. సిగ్గుపడి మేనువడఁకఁగ
దిగ్గునఁ బూసెజ్జడిగ్గి ♦ తెరమఱుఁగున నై
యగ్గురుకుచ వోవఁగఁ జెలి
బెగ్గిల నద్దేపిచూచి ♦ ప్రియము దలిర్పన్. 113

క. ఇదియేమి తప్పుగా నిటు
బెదరెదరే నాదు కూర్మి ♦ బిడ్డ తేనమదిన్

మదనునిఁ గోరిన రప్పిం
చెదఁ జెప్పఁ డటన్నఁ బ్రీతిఁ ♦ జెలంగి లతాంగుల్. 114

సీ. ఓయమ్మ నేఁడు మే ♦ ముత్సవాహ్వయకేళి
కాననాంతరసీమ ♦ గాఁచినోమఁ
జని విహారంబులు ♦ సలిపి క్రమ్మఱి రా ర
సాలవేదికపై వి ♦ శాలనేత్రుఁ
డాజానుబాహుఁ ♦ డత్యంతమోహనమూర్తి
యొక రాజనందనుం ♦ డొంటినుండ
మనకాంతిమతి చూచి ♦ మన్మథుఁడను భ్రాంతి
నుల్లంబు మరపిల్ల ♦ నున్నయదియు

గీ. విన్నవించితి మాతయు ♦ వెఱపులేక
యింకమీఁదటఁ గర్తవ్య ♦ మెద్దిగలదొ
దెలిసి బాలిక విభ్రాంతిఁ ♦ దీర్పుఁడనుచుఁ
జెలులు పలుకంగ నప్పు ♦ డచ్చెరువు దోఁప. 115

క. మతిశాలి రాజశేఖర
పతి యనిపిన దివ్యరత్న ♦ పంజర శుకమున్
జతురతఁ గైకొని యప్పుడ
చతురిక యేతెంచి రాజ ♦ సమ్ముఖ మగుటన్. 116

గీ. తరుణి చేతికి నిచ్చుట ♦ తగవుగామి
నృపతి సన్నిధి నిడి దేవ ♦ నేఁడు నేను
వన వినోదంబునకుఁ బోయి ♦ వెనుక చిక్కఁ
గాఁగ నొకచక్కఁ జక్కని ♦ రాజసుతుఁడు. 117

క. మీరాజు సమ్ముఖంబున
నీరాజశుకోత్తమంబు ♦ నిడుమన నిది యే
కారణమొ యనుచుఁ దెచ్చితి
భూరమణవరేణ్య యనుచుఁ ♦ బొలఁతి తొలంగన్. 118

క. చిలుక యపుడ ధిపుతోడన్
బలికెం బంజరము వెడలి ♦ భూపాలలనా
కల కల మంజీరధ్వనిఁ
కల కల నగఁ దగిన కలికి ♦ కమ్మని పలుకుల్. 119

సీ. శుభమస్తు వైభవ ♦ ప్రభుగుణ సంభవ
శ్లాఘూప రాభూత ♦ శక్ర నీకు
భద్రమస్తు సముద్ర ♦ ముద్రితక్ష్మాభరా
భరణ కదూ్రిసుత ♦ ఘోరిధి నీకు
విజయోస్తు నిష్ఠుర ♦ నిజభుజా సముదగ్ర
విక్రమక్రమ కళా ♦ విజయ నీకుఁ
గళ్యాణమస్తు స ♦ త్కవిరాజ సంకల్ప
కల్పనాకల్పనా ♦ కల్ప నీకు

గీ. నాయురస్తు తుషార సీ ♦ హార రహార
ధాళధళ్య ప్రభా మల ♦ ధవళ కీర్తి
సాంద్ర చంద్రా తప క్లాంత ♦ శత్రురాజ
విరహిణీ లోకహృదయా ర ♦ వింద నీకు. 120

శా. రామప్రాభవ మైంధవాధిప కుమా ♦ రా సింధు భూపాల స
న్నేమోకా మదిలోఁ దలంపకు వచో ♦ హే వాక కాకోదర
స్వామి న్నాకుఁ ద్రికాల వేదియని భూ ♦ పాదేవి పేరిచ్చె నా
రామారత్నము చేతిరా చిలుక నే ♦ ర్పన్ నేర్చితిన్ సర్వమున్ 121

శా. వాదింతున్ బహువేదశాస్త్ర కలనా ♦ వైయాత్యసంసిద్ధి న
వ్వేదవ్యాసుల తోడనైన మదిసం ♦ వీక్షించి యెచ్చోట నేఁ
గాదన్నన్ మఱి నిర్వహింపఁగ నశ ♦ క్యంబేరి కస్మద్వచ
శ్శ్రీదాంపత్యము నాకనాకయనుకో ♦ సిగ్గయ్యెడున్ భూవరా. 122

మ. ప్రకట శ్రీకరరాజశేఖర మహీ ♦ పాలుండు ఘోరాసుర
ప్రకటధ్వంసన మాచరింపఁగ నటన్ ♦ బ్రత్యక్షమై చంద్రమ

శ్శకలోత్తంస వధూటి నన్నొసఁగె నా ♦ శౌర్య క్రియాశాలికిన్
శుకమాత్రింబనినన్నుఁ జూడకు బుధ ♦ స్తోమైక చింతామణీ. 123

మ అదిమొట్లుండఁగనిమ్ము హేతిహతమ ♦ త్తారాతి సత్కీర్తిపా
రదశోభాకరదోః ప్రతాపశిఖినా ♦ రజ్యద్ద్వ చిత్రక్రియా
స్పదుఁ డావంచకనాథనందనుఁడు రక్షశ్శైల దంభోళి యా
మ్మనిరాక్షీ మకరాంకమూర్తి గడు ♦ సమ్మానించు నన్నున్ కృపా.

మ కదనక్షోణి విశంకటాసుర వర ♦ గ్రామీణు దర్పంబు వా
ల్చి దదీయంబగు నాత్మదేశమున క ♦ క్షీణత్వరం బోవఁద్రో
వ దరగ్రాంతిఁ దదీయ రక్ష్యములు ని ♦ ల్పన్ నేటికి న్నిల్చినాఁ
డవె నీకేళివనాంతసీమ నన రా ♦ జాశ్చర్య నిర్మగ్నుఁడై. 125

మ. తిన దేవేరి మెఱఁగింబుచూచి యిదె కాం ♦ తాకంటివే వింతలే
మనివర్ణింపఁగవచ్చు నిచ్చిలుక యా ♦ హా పుట్ట నిట్టాడునే
మనమాశ్చర్యపయోనిధి న్మునిఁగె నీ ♦ మాహాత్మ్య మేరీతిఁ గ
ల్గెనో ము న్నేమి తపంబుచేసె నొకొ యీ ♦ కీరంబు పెంపెట్టిదో.

మ మనుచుం శాగ్రిణి రాజ శేఖరుఁ డా ♦ మాత్యుండుగాఁ డిప్పుడేఁ
జని యచ్చోటికిఁ దోడితేవలయు నీ ♦ సౌజన్య ధన్యాత్ము నీ
యనఘున్ గీరవరేణ్యు గాంతిమతి కి ♦ మ్మా వేడ్కసంధిల్ల నం
చు నృపాలుండు మృదంగభేరి పటహా ♦ స్తోమాతి సన్నాహుఁడై.

గీ చని కనుంగొని యత్యంత ♦ వినయ సంభ్ర
మంబు లుప్పొంగ నాలింగ ♦ నం బొనర్చి
హేమ ధన్వ మహీపాలుఁ ♦ డేని యింత
వేడు సేయుఁడుగా మమ్ము ♦ వీరవర్య. 128

గీ. ఇట్లు చేరువకే తెంచి ♦ యిష్ట బుధుఁ
డయినను జూచి పోవు నం ♦ తయును లేదె
యనుచు విహితాను లాపంబు ♦ లాడు సింధు
కువలయాధీశు ప్రియనుచే ♦ కొని యతండు. 129

శా. ఆరూఢిం బుర రాజవీధి విభవా ♦ హంకార జంభారియై
రా రా నంతకుమున్న కాంతిమతియా ♦ రా చిల్కయుండాను గే
లీ రాజన్మణి సౌధమెక్కెఁదమి నా ♦ లీలావతీ మన్మథా
కారశ్రీనిధి రాజశేఖర మహీకాంతు ♦ న్నిరీక్షింపఁగన్. 130

చ. చిలుక పురోహితుండగుచుఁ ♦ జెంగటనుండఁగ సిగ్గుపెందెరల్
దొలఁగఁగ బ్రోచిబంధుగతి ♦ దోరపుఁగోర్కులు సందడింపఁగాఁ
దలఁపు లతాంగి జన్మమును ♦ తాన కనుంగవ దోయిలించి చూ
పులఁ దలఁ బ్రాలుపోసె నృప ♦ పుత్త్రునిపై విరహాగ్ని సాక్షిగన్.

వ. అప్పుడా రాజకీరంబు రాజముఖి కిట్లనియె. 132

ఉ. చేడియ యీ నృపాలకుల ♦ శేఖరు సంతత దానశీలుఁ గొం
డాడఁగ వేయినోళ్ళువలె ♦ నంచు వచించితి నప్పు డిచ్చకం
బాడితినో నిజంబ కొని ♦ యాడితినో యిటఁగన్నులారఁగాఁ
జూడుము హేమధన్వనృప ♦ సూతిమనోహర రూపసంపదల్. 133

సీ. తలిరాకుఁబోఁడి నీ ♦ తపములు ఫలియించెఁ
గడలేని మమతలఁ ♦ గలయవమ్మ
చంపకగంధి నీ ♦ సంకల్పమీడేఱె
నానందవార్ధినో ♦ లాడవమ్మ
పల్లవపాణి ♦ నీ భాగ్యంబు చేకూఱె
మనసులోఁ దహ తహ ♦ ల్మానవమ్మ
పూర్ణేందువదన నీ ♦ పుణ్యంబు సమకూఱెఁ
జిరవైభవోన్నతిఁ ♦ జెలఁగవమ్మ

గీ. మాటలింకేల సౌఖ్య సా ♦ మ్రాజ్యమునకు
గంబుకంధర పట్టంబు ♦ గట్టవమ్మ
పెనిమిటియు నీవు మచ్చిక ♦ ననఁగి పెనఁగి
మగువ నామీఁది పక్షంబు ♦ మఱవకమ్మ. 134

ఉ. ఎక్కడి రాజరాజసుతుఁ ♦ డెక్కడి నిర్జరరాజ నందనుం
డెక్కడి యిందిరాతనయుఁ ♦ డేల నుతింతురొ కాని లోకు లీ

చక్కని మానవేశ్వరుని ♦ చందము చూడరు సువ్వె రొక్క నాఁ
డక్కఱ తోడవానిఁ గల ♦ యంగను సంగన భాగ్య మెట్టిదో. 135

క. అని యపుడు రాజకీరము
వనితామణి నధికమధురవాగ ♦ మృతాబ్ధిన్
మునిఁగించె నచట మైంధవ
జనపాలక నందనుండు ♦ సంభ్రమ పరుఁ డై. 136

సీ. కనకపంజరశారి ♦ కాకీర కిన్నర
ద్వంద్వకోలాహలో ♦ త్తాల రవము
ముహురుదరనీగోద్ధూత ♦ తుహినోద భస్త్రికా
పతదంబుకణగణ ♦ ప్లావితంబు
మర్దలౌఘధిమధి ♦ మ ధ్వాన గతి నట
త్కంజభృన్మండలీ ♦ రంజితంబు
జాలకాంతరల స ♦ చ్చంద నాగరు ధూప
సౌరభ సంభార ♦ సంభృతంబు

గీ. లలితతోరణ మాలికా ♦ లంకృతంబు
బహువితాన వితాన ♦ విభాసితంబు
నైన నవరత్న కీలిత ♦ హర్మ్య మొకటి
విడిదిగా వించి యవ్విభు ♦ విడియఁ జేసి. 137

క. తన నగరికరిగె నపుడ
జ్జనపతి నందనుఁడు కేళి ♦ సౌధస్థలిపై
వనితామణిఁ దలపోయుచు
ననువేల దృఢానురాగుఁ ♦ డై యుండుతఱిన్. 138

చ. పనివడి పద్మినిం బగలుఁ ♦ బైకొనియుండుట గానసీక వం
చన నటియించి పశ్చిమ ది ♦ శారమణిం గలయంగఁ బోవుచో
వనజ హితుండుమై తుడిచి ♦ వైవఁగరాలు పరాగపుంజమో
యనఁ గనుపట్టె న స్తశిఖ ♦ రాంతరసీమల సాంధ్యరాగముల్. 139

గీ. అపుడు చీకటి యుల్లల ♦ నాక్రమించి
పార్థివాగ్రణి యనురాగ ♦ భద్రపీఠిఁ
బొంచి యమ్ముల వాన నిం ♦ డించె నపుడు
చిత్తసంభవుఁ డలయింద్ర ♦ జిత్తనంగ. 140

మ. జలజాతాహిత మాంత్రికాగ్రణి కరా ♦ జాలాఢ్యుఁడై దీపికా
కలికాభీల విషా నలావిల తమః ♦ కాలాహి మూర్ఛోవి య
ల్లలనా దేహము తారకాళికర ళా ♦ లా బిందువై యుండ వె
న్నెల మందుల్ పఱఁబూసి తేర్చె ననఁగా ♦ న్పించెం బ్రసన్నద్యుతిన్

వ. మఱియు నంతకంతకుఁ జెన్ను మిగులు వెన్నెల మున్నీరు బెట్టు నిట్టవోడిచినం దొట్టి పట్టుపగలింటి చందంబున నందంబై కనుపట్టె నప్పు డుప్పతిల్లు విరహ పరితాపంబులఁ జీకాకుల గుందు దుర్ఘన శోకంబులగు చక్రవాకంబులును నరవిరసి నెఱసి చెంగలించు చెంగల్వవిరుల కచ్చుల మెచ్చుల క్రొత్త నెత్తావి మొత్తంబుల నెత్తుకొని హత్తుకొని మొత్త మొత్తనం దిరుగు జిలిబిలి వలికరుపలి బల బులును నిండు నెలమ గండు గండుమెఱసి యేతేరఁ జేఁజిచూచిన తొగవగుల విరుల నిగ నిగ నిగుడం జూపుఁ జాలనం జాలి యందంద యందలి మధుర మధురస కణ విసరంబు లెసక మెసగం గ్రోలి మైమఱచి తఱుచు పఱుచు తుమ్మెద కొదమ కదుపులును బుట పుట నికటికి వెన్నెల తుటుములం జిటులఁ జంచూపుటంబులం గమిచి సముచితో పలాలనంబునం దెచ్చి యిచ్చి తమ తమ గరితలు గరితాల్ప నెఱతనంబున నటియించి హృత్తటంబునం బొడమిన చిట పొటలువో ఘటియించు చంచచ్చకోర విట పటలంబులును గరంగి తరంగితంబగుచుం బొంగి కుముదాంకోపల సలిలంబులం జాలు నేఱులఘుమ ఘుమధ్వానంబులును నిజకాముకుల చక్కటికిం జిక్కటిలు నక్కఱఁ జిక్కి చనుచక్కని చందన గంధుల యందియల సందడియును గుసుమ కోదండ చండ శరకోదండ దండిత లగుచు దండియలు మీటుచుం బాడు చేడియల కలకలంబులును దండోప తండంబులగు రుచిర కాండంబుల మెందుకొను వెండి పళ్ళేరంబు లొండొండ నిండఁ

బుండేక్షు ఖండ శర్కరాఖండ క్షీరపూరంబులు గొంచి యిచ్చు విలు
కాని మారునకుఁ బ్రేమ నర్పించు కన్నియల తిన్నని యెలుంగుల యల
బలంబులునునై విజృంభించి పంచ శరశరసంచయము వంచిత ధైర్యా
డగుచు నమ్మహీ వల్లభుం డాయల్లక భరంబున నుల్లంబు పెల్లగిలం
దరపిల్లుచుండె నంత గాంతిమతియును నత్యంత సంతాపితాంత రంగ
యగుచు వగల నోగులం దగు సఖుల కొప్పగించి యాచ్చెలుక జేఁసు నర
పతి చందం బరయ రయంబున నేతెంచిన. 142

క. రాచ కొమారుఁడు ముద్దుల
రాచిలుకం జూచి పలికె ♦ రస వద్వాకస
ద్వాచాల మధుర మధురిమ
మోచాఫల సార నాకు ♦ ముచ్చట దీఱన్. 143

క. క్షితి పాలకుఁడే మనియెం
జతురిక యేమనియె నితర ♦ సఖులేమని రా
సతిమణి దానేమనియెను
మతిశాలీ వేగఁ జెప్పు ♦ మాయన నదియున్. 144

సీ. మనుజేశ యలకేలి ♦ వనములో విహరింపఁ
జనిపిని శుద్ధాంత ♦ మునకుఁబోయి
తివిఱి యటమున్న కాం ♦ తిమతీ కుమారికా
విరహాప లాపముల్ ♦ విని నృపాలు
డును దేవియును వచ్చి ♦ తనయ చక్కటికుండఁ
జతురిక నన్నుంచె ♦ నతని యెదుట
నేను దేవర రాక ♦ యెఱిఁగింప వార్షించి
యచటికి వేవేగ ♦ నరుగుదెంచె
గీ. నిటఁ గుమారిక నన్ను నెం ♦ తేని గార
వించి భవదీయగుణము లా ♦ లించి పంచ
శర శరాహతిఁ గుందె దు ♦ ర్భర వియోగ
భరము భరియింపఁ జాలక ♦ తెరలి పడుచు. 145

సీ. తుదగోళ్ళఁ బలుమాఱుఁ ♦ దుంచి పోసినవలు గాఁగ
వేసిన చివురుల ♦ విధము చూచి
బెట్టుగాఁ దెట్టువల్ ♦ గట్టి పైపై సెకల్
చల్లు నిట్టూర్పుల ♦ జాడ చూచి
చిక్కుటంబుగ మేని ♦ యుక్కచేఁ గమలిన
విరిపూవు సజ్జల ♦ కరణి చూచి
కడలేనికాటుక ♦ కన్నీటికాలువ
మడువులుకట్టిన ♦ వడువుచూచి
గీ. కనలి యూరక పనిలేని ♦ పనికినైన
నింత మొక మోటలేక య ♦ య్యిందు వదన
ప్రాణసఖిఁబల్కు పల్కుల ♦ పగిదిచూచి
నాకు వెఱఁగయ్యె నప్పుడో ♦ నరవరేణ్య. 146
ఉ. సందియమింతలేదు పెలు ♦ చన్ ననుమొగ్గల మిట్టకోలలన్
గందనకాయచేసె సుమ ♦ కార్ముకుఁడేమని చెప్పవాఁడ నే
నందుకుఁ దోడువీఁడె హరి ♦ ణాంకుఁ డహంకృతిఁ జూపఁజొచ్చె నిం
కం దరళాక్షి చందమెటు ♦ గాఁగలదో యశూడుం దలంకుచున్. 147
వ. అప్పు డప్పుడమిఱేఁడు విరహాభరంబు భరియింపలేక రాకా నిశా
కరు నుద్దేశించి. 148
సీ. కలుచుకొంచును ద్రావఁ ♦ గాఁ గాచియున్నారు
సురలు నేయెమ్మెలు ♦ స్రుక్కవేల
తుయమునానాఁట న ♦ గ్గలముగా నీకనో త్తి
వచ్చునీ జాడలు ♦ వదలవేల
పెనుపాప పగవాఁడు ♦ పెడతలగండఁడై
యుండ నీ మదవృత్తి ♦ యుడుగవేల
యదియునుగాక మే ♦ నంతయుఁ గాళిప
ట్టుకరాఁ దొడంగె నీ ♦ వికృతియేల
గీ. యదిరిపాటుగ నుదధిలో ♦ నౌర్వవహ్ని
నపుడు పడియెదవోగాని ♦ ఘోరుఁగరాదు

చెప్పినట్టులువచ్చునే ♦ సితమయూఖ
యేలత్రుళ్లెద విదియ్యేమి ♦ మేలునీకు. 149

ఉ. రాహువుగాను నిన్నుఱఁగ ♦ దాచినశూరుఁడఁగాను సీతను
ద్రోహముచేసినట్టి యల ♦ రోహిణితండ్రినిగాను దజ్జగ
న్మోహిని నీలనీలకచ ♦ ముద్దులచక్కెరబొమ్మఁ గూర్చ క
య్యోహరిణాంక తావక మ ♦ యూక ముఖంబుల నేచ నేటికిన్. 150

వ. అనియిత్తెఱంగునఁ జిత్తంబున నెత్తిన తత్తరంబునం దరంబుగాని విరహా
భరంబు భరియింపఁ జాలక పొరలునంత. 151

గీ. రతిపతిశర వర్షశాశన ♦ క్రమముదెలుప
మొనసి దీపించునల యింద్ర ♦ ధనువనంగఁ
బ్రాచి యమిచిన తాంబూల ♦ రసమనంగ
నుదయరాగంబు మెల్లన ♦ నుప్పతిల్లె. 152

గీ. తనదుమనుమని పెండ్లికెం ♦ తయును వేడ్క
నఖిల దిగ్నాగ పతుల ర ♦ మ్మనుచు శోభ
నాక్షతంబులు వెట్టిన ♦ యట్టికరణి
గమలబాంధవదీప్తి న ♦ ల్గడల నెఱసె. 153

సీ. అట్లుప్రభాతంబైన ♦ నావంచకాధీశు
తనయుండు కాలకృ ♦ త్యములుదీర్చి
వసియింపనటసింధు ♦ వసుధేశుఁడును మంత్రి
హితపురోహితుల స ♦ మ్మతి వహించి
యాహైహయధ్వనికి ♦ నాత్మ తనూజాతఁ
గాంతిమతీకన్య ♦ కా లలామఁ
గళ్యాణమొనరింపఁ ♦ గౌతుకోన్నిద్రమా
నసుఁడై దిగంతభూ ♦ నాథతతికిఁ

గీ. బ్రీతి శుభలేఖ లనిచి ర ♦ ప్పించి మిగుల
మంచి లగ్నంబుగా నిశ్చ ♦ యించి పుర మ
లంకరింపంగ నియమించె ♦ లవణవార్ధి
వేష్టితాశేష మహీ జను ♦ ల్వేఱఁగు పడఁగ. 154

సీ. కేళీ ధిం జూచిన ♦ నిందు బింబానవా
లాలితలాస్య కో ♦ లాహలంబు
శేసా ఢం జూచిన ♦ సితరేతరాలాప
సమ్మర్ద బధిరి తా ♦ శాముఖంబు
లే చాయం జూచిన ♦ భోజనోత్సవ కర
పరిత్యాగ మౌక్తిక ♦ రంగవల్లు
లేచక్కిం జూచిన ♦ సిద్ధపుణ్యాంగనా
కల్పిత కళ్యాణ ♦ గానఘణితు
గీ. లెచటం జూచిన నవరత్న ♦ నిచయ రచిత
వివిధ తోరణ మాలికా ♦ విలసనంబు
లెంపుం జూచిన జగదభి ♦ నందితాచ్ఛ
బహుల పిశానంబు లప్పురిం ♦ బరిఢవిల్లె. 155

క. చను దెంచు పౌరయాత్రిక
జనులకుం బర్ణానిలంబు ♦ చలువల కినంగా
మునువాకిళ్ళను బెట్టిరి
కనక మయోదగ్రి కదళి ♦ కా స్తంభములన్. 156

గీ. అపుడు శుద్ధాంత మున కేగి ♦ యవని విభుండు
శుభ ముహూర్తంబు నేండు మె ♦ చ్చులపఱుందు
గలిగె మనకాంతిమతిభాగ్య ♦ గౌరవమున
నేలయూలస్య మింకవూ ♦ ర్ణేందువదన. 157

క. సైరంధ్రులం బిలిపించి కు
మారికం గైసేయబంపు ♦ మాయన నద్దే
వేరియు భూపతియనుమతి
వారి నియోగింప నధిక ♦ వైభవ ముదవన్. 158

సీ. అంగనా మణికిని ♦ సంపంగి నూనియు
శిర సంటెనొక్కరా ♦ జీవగంధి
పువ్వుం బోండికి గోళ్ల ♦ దువ్వె గంధామల
కము వెట్టె నొక్కరై ♦ కత నితంబ

కలకంఠికిఁ ♦ గమ్మపన్నీట మ
జ్జన మాచ్చెనొక్క వి ♦ శాలనేత్రి
యలినీల వేణికి ♦ వెలిపట్టుపావడఁ
దడియొత్తెనొక్క వే ♦ దండగమన

గీ. మానవతికొర్తు చెంగావి ♦ మడుగు గట్టె
గురుపయోధరకొర్తు క్రొ ♦ వ్విరులు దుఱిమెఁ
గీరభాషిణికొర్తు క ♦ స్తూరి యలఁదెఁ
జంద్రముఖికొర్తు రత్న భూ ♦ షణము లిడియె. 159

క. ఆనలిన నేత్రి యప్పుడు
నానావిధ రత్న భూష ♦ ణచ్ఛవిలోనన్
గానంగఁ బడియెఁ గింశుక
సూనాంతర భాసమాన ♦ శుకియో యనఁగన్. 160

శా. ఆరీతిన్ సఖులొయ్యఁ దేర వసుధా ♦ ధ్యక్షుండు తానక్కుమా
రీ రత్నంబతి మానమానస ధృతిఁ ♦ బ్రీతిన్ విలోకించి పై
పై రోమాంచము లంగకంచుకము లై ♦ ప్రాపింపఁ జెల్లుబ్బె జం
భారాతిప్రథమాన వైభవకళా ♦ హంకార సంక్రాంతుఁడై. 161

గీ. అధికసంభ్రమయుక్తిఁ గ ♦ ళ్యాణవేది
కై కుమారికఁ దెమ్మని ♦ యచటి కడుపు
రాజశేఖరమేదినీ ♦ రమణ వరుని
రా నియోగింప వైభవ ♦ ప్రాభవముల. 162

సీ. తమరు ధమామికా ♦ తమ్మట కాహళ
పటహ భేరీ మహా ♦ ర్భటులు మొఱయ
సకల పుణ్యాంగనా ♦ జన సమర్పిత లాజ
జాలంబు నక్షత్ర ♦ సమితిఁ దెగడ
భూపాల వర్గంబు ♦ స్తోత్రపుత్రోక్తిఁ బాడుచు
గిరికొని రెండు ప ♦ క్కియలు నడువ

నవని సురశ్రేణి ♦ యాశీర్వచః ప్రౌఢి
కోలాహలంబు ది ♦ క్కులఁ జెలంగ

గీ. జయ విశంకటరిపుశైల ♦ జంభభేది
జయ త్రిలోకవిసారిత ♦ సారకీర్తి
జయవిలాసవతీ పుష్ప ♦ చాప యనుచు
వందిజనవాక్య వైఖరి ♦ క్రందుకొనఁగ. 163

గీ. నగరి మొగసాలకేగినా ♦ నరవరుండు
తాను బంధులు సంభృత్యో ♦ త్సాహులగుచు
నెదురుగావచ్చి తోడ్కొని ♦ యేగుదెర
జూపఱకుఁ జూడ్కులింపుల ♦ జూఱలాడె. 164

ఉ. ఈజగ మెల్ల నేలుమని ♦ యేర్పడఁ జూపెడు భంగిఁ బంకజ
శ్రీజనయిత్రులైన తమ ♦ చేతులఁ గీల్కొనఁ జేసి రత్నవి
భ్రాజ హిరణ్యపాత్రికలు ♦ పల్మఱుఁ ద్రిప్పుచు నొయ్యనొయ్య నీ
రాజనముల్ ఘటించి రుడు ♦ రాజ నిభాస్యలు హైమధన్వికిన్. 165

గీ. చవులుగొలిపెడు ముత్యాల ♦ చవికెలోనఁ
బసనివెలిపట్టు నిండారఁ ♦ బఱచినట్టి
కనకపీఠికఁ జూపి య ♦ జ్జనవిభుండు
చేరివినయంబుసేయ నా ♦ సీనుఁడయ్యె. 166

శా. డాకేల న్నిజకన్యకామణుల కం ♦ ఠశ్రేణి గీలించి పీ
ఠాకంజాతము లాత్మపాదనఖరే ♦ ఖం దార్చ సంగీత వి
ద్యాకౌశల్యము గానరా మదికి నా ♦ హ్లాదంబు సంధిల్ల గౌ
రీ కళ్యాణము పాడిరప్పుడు పురం ♦ ధ్రీరత్నముల్ వేడుకన్. 167

శా. రారమ్మంచు గడుంగి వృద్ధవనితల్ ♦ ప్రార్థింప లజ్జానతా
కారం బంగజ సజ్యకార్ముక గతిం ♦ గల్పింపనే తెంచి త
న్నీరేజాక్షి కెలంకులం బసిఁడి గిం ♦ డిం దోయము ల్వోయ న
గ్గారాపల్లుని పాదముల్గడిగె న ♦ క్షయ్యప్రమోదాత్ముఁడై. 168

ఉ. కల్పితశోభనోచిత సు ♦ కర్ములు గౌతమగార్గ్యగాలవా
నల్పమహాను భావమతు ♦ లాత్మపురోహితు లాగమోక్త సం
కల్పము చెప్ప భూధవశి ♦ ఖామణి కన్యక ధారవోసె నా
కల్పవిశాలకీర్తికి జ ♦ గజ్జన సంస్తవనీయ మూర్తికిన్. 169

క. వరనిశ్చల శౌర్యాంబుధి
తెరయెత్తిన రీతి నడుమఁ ♦ దెరయెత్తిరి య
న్నరపతియు ముద్దుపట్టిం
దెరమఱుఁగున కపుడుతోడి ♦ తే నియమింపన్. 170

సీ. ప్రాణసఖీరత్న ♦ మరగాను గెంగేలఁ
దొడికి యొయ్యొయ్యన ♦ నడువ మనఁగ
నుడిగంపుఁ దొయ్యలి ♦ యొత్తు పావడఁదెచ్చి
చిఱుత నెమ్మోము లేఁ♦ జెమట తుడువ
సందడి జడియు న ♦ సింధుబింబాస్యలు
కైదండలిచ్చుచుఁ ♦ గ్రందుకొనఁగ
మందయానంబున ♦ మసలుటఁ బద నఖ
లాక్షారసాంక ము ♦ ల్లక్ష్యము గనఁ

గీ. గ్రేళ్ళుదాటెడు చూపులు ♦ క్రిందనిండఁ
గ్రమ్మినీలాల నెలకట్టు ♦ కరణి మెఱయ
గాఢ లజ్జాభయంబులు ♦ గడలుకొనఁగ
జంద్రముఖివచ్చెఁ బెండిలి♦ చవికె కడకు. 171

క. మంగళసూత్రముఁ గట్టెఁ గు
రంగవిలోచనకు నపుడు ♦ రాజోత్తంసుం
డంగాంగ యోగసౌఖ్యోత
రంగిత పులకాంకురాళి ♦ గ్రందు కొనంగన్. 172

మ. చెలులెల్లం గరపాణి పద్మమున నా ♦ చిన్నారి పొన్నారి ము
ద్దుల రాచూలి విలగ్నముం దొడికి తో ♦ డ్తో నెత్తఁగా ముత్యపుం

దలఁ బ్రాల్పోసె వసుంధరాధిప కులో ♦ త్తంసంబు పై నన్మహీ
తలనాథుండు నొసర్చె నట్టిపగిదిం ♦ ద త్త్రక్రి యా కేళికల్. 173

గీ. అట్లు వైవాహికార్యాకృ ♦ త్యములు నెఱపి
నాలుగవ నాఁడు సకలబాం ♦ ధవులుఁ జెలఁగ
నరవరాగ్రణి లోచనా ♦ నందముదవ
నాగవల్లి యొనర్చుట ♦ కై గణింప. 174

సీ. ఆణిము త్తియము లో ♦ క్కంత గా నొండొండ
మేలేర్చి నిండారఁ ♦ గీలుకొలిపి
వెలలేనిబ్రాఁతి ప ♦ చ్చలు దెచ్చిదోయిళ్ళ
నించి దట్టముగా ♦ నెఱపి నెఱపి
నెఱ రంగుగల జాతి ♦ నీలాలు గుదిగ్రుచ్చి
యేనుఁగుల్ చక్కఁగా ♦ నేర్పఱిచి
యెదిరి కన్గొనరాని ♦ ముదురుఁ గెంపులుపోసి
తెలుపేఁ గానికల్కి ♦ కిక్కిఱియఁజలపి

గీ కలయఁ జొక్కంపు గోమేధి ♦ కములు నిలిపి
పంచవన్నెల ముగ్గులు ♦ పరిఢవిల్లఁ
బ్రోలుదీర్చిరి చూడ్కికిం ♦ పులు ఘటింపఁ
బడఁతుల త్తతిఁ బసిఁడి కీ ♦ ల్పరితి మ లనఁగ. 175

గీ. కన్నెచనుదోయి చుట్టముల్ ♦ గానఁబ్రీతి
వానికళ్యాణ వేళకై ♦ వచ్చినట్టి
తమ్మిపూమొగ్గ లోయనఁ ♦ దాల్చిరచటఁ
బూజకుండలు తారకా ♦ రాజముఖులు. 176

గీ. సింధుభూపాలు సత్కీర్తి ♦ చెలఁగిపద్మ
జాండమవ్వల నీరీతి ♦ నావరించుఁ
జూడుఁడనుమాడ్కిఁ దెల్లని ♦ సున్నమలఁది
మానవతులందు నిలిపి రై ♦ రేని కడవ. 177

క. ప్రోలని యొడు కాసారము
లో లీలం జెలంగు చెంగ లువ మొగ్గలనన్
జాల బహుదీపకళికలు
చాలుగ ముట్టించి రంత చంద్ర నిభాస్యల్. 178

వ. మఱియు దత్తమవిత కృత్యంబులు మసలక ముసలిముత్తైదువ లొనరింప నిలింప విభు నిభుండగు నమ్మహీకాంతుండు కాంతిమతీ కన్యకా సమేతంబుగా హోమక్రియా కలాపంబులు బహువిధ సల్లాపంబులు గురుజన వందనంబులుం గులదేవతా సందర్శనంబులు నాదియగు మంగళ కరణీయంబులు గావించి. 179

చ. మగువయు నాథుడుం బటిడి మంచముపై వసియించి యొంతొరుల్
మొగములు వంచి యోరసిలి ముంచిన సిగ్గులఁగన్ను గోనలన్
నగవు దొలంక విప్రముఖు సంబుల కిచ్చిరి దివ్యవాసనల్
బుగులుకొనంగఁ జేసిన య పూర్వమనోహర వీటికావళుల్ 180

ఉ. అంతటఁ బౌరయాత్రిక ధ రా వరముఖ్యులు వారివారి క
త్యంతదృఢానురక్తి వివి ధా భరణంబులు చిత్రవర్ణ సు
క్రాంత వినూతనాంబర ని కాయములుం జదివించి రాత్మనిం
తంతన హాని వైభవ మ హా విభవంబులు సందడింపగన్. 181

ఉ. మామ యమేయ మార్గణ స మాజ మధువ్రతపుష్ప వాటికా
సీమ యొసంగె నల్లునకు సింధు సబంధు తటాక బంధుర
గ్రామము లాతిథేయపుర రాజ రమావిభవ ప్రయుక్త సం
గ్రామము లిష్టబాంధవ ని కాయము నివ్వెఱఁగంది చూడఁగన్.

ఉ. మానవలభర్త శీతరుచి మాన్యుఁడు తావకకీర్తి యేతదు
త్సేక మడంచెఁ జెల్లదని చేతికి నప్పనచేసెనో యనన్
గోకకుచా మనోభవున కున్ దనయల్లున కిచ్చె సింధు ధా
త్రీ కమ నాగ్రగణ్యుఁడొక దీపిత వజ్రసుగంధ పేటికన్. 183

ఉ. దీనిరణోర్వి నక్కునర దేవుఁడ జేయుఁడతండు గట్టులా
యాన ననేకవర్ణజవ నాశ్వము లాతఁడు కన్గొనుంద్రిలో

కీనుత కీర్తులంచు నృప ♦ కేసరి యల్లునకిచ్చె ఠొక్కటే
జీ నవరంజి ద్రాతపని ♦ చిత్రప పల్లము లుల్లసిల్లగన్. 184

క. తనుపునకిచ్చెఁ గుమారికి
వసుధాతల భర్త శాలి ♦ వర వర్ణితముల్
కుసుమ శరచాప రుచి భూ
లసమానము లూళ్లు నూఱు ♦ నర్ఘ్యము గాఁగన్ 185

ఉ. మాళవగౌళచోళ కురు ♦ మాగధు లంపిన వారిలోన సం
శీలలఁగా వివేకవర ♦ సీమలఁగా రమణీయ రూపరే
ఖా లలితాంగ వల్లరులఁ ♦ గా నుఱిగంబున కేర్పఱించి భూ
పాలకుఁడిచ్చె నూఱుపుర ♦ బాలికలం దనయా లలామకున్. 186

ఉ. ప్రాణము ప్రాణమైన తన ♦ యామణి నప్పుడు చేరఁ బిల్చి యిం
ద్రాణికినైనఁ గంస రిపు ♦ రాణికినైనఁ గణింపరాని క
ట్టాణి మెఱుంగు ముత్తియ మ ♦ నర్ఘ్యము మంగరకిచ్చెఁ దల్లియు
క్షీణరుచి ప్రకాండములు ♦ చెంగట వెన్నెల గాయుచుండగన్. 187

సీ. ధగధగాయిత రుచి ♦ స్థగిత నానారత్న
సముదీర్ణ రత్నభూ ♦ షణ చయంబు
చిత్రవర్ణాంబర ♦ శ్రేణీ సమంచిత
కాంచన మయపేటి ♦ కా వ్రజంబు
ఘనసార కస్తూరి ♦ కా సంకు మదపూర్ణ
రారజ్య మాన క ♦ రండ సమితి
పరిచరముక్తా ఫల ♦ వ్రాత కళాచికా
కర్కరికాసము ♦ త్కరము మఱియు

గీ. వివిధ వస్తువితానంబు ♦ వేఱువేఱ
కంచుకీ సంచయంబులు ♦ గొంచురాఁగ
సింధు భూభర్త దేవేరి ♦ చిఱుత ముద్దుఁ
గూఁతునకు నిచ్చెఁ గోర్కులు ♦ గొనలుసాఁగ. 188

క. కంజాత రాగ మణిగణ
సంజాత రుచిచ్ఛటా వి ♦ శంకట మగుచున్
రంజిలు పంజర మాన్నృప
కుంజరుఁ డారామ చిలుక ♦ కుం దగనిచ్చెన్. 189

గీ. అట్లు మామయు నల్లుంకు ♦ నఖిల బంధు
సమితియును నీడు జోడాడి ♦ సంభ్రమింక
నంత నరుణో దయంబయ్యె ♦ నవ్వ చుచిత
కృత్యములు దీర్చి సింధుధా ♦ తీశ్రి విభుండు. 190

సీ. సకల వస్తువ్రాత ♦ సంపూరితములైన
కాంచన మయశతాం ♦ గములు నూఱు
ఖచిత నానారత్న ♦ కంకణంబులతోడఁ
గోమరారుదంతా వ ♦ శములు వేయి
కరువలికన్న వె ♦ గ్గలముగా మున్నాడఁ
జాలిన దొడ్డతే ♦ జీలు లక్ష
విక్రమార్కునికంటె ♦ విక్రమోన్నతిగల
పరమాప్తులైన స ♦ ద్భటులు కోటి

గీ. వేలువేలుగ నేర్చి ప్ర ♦ ఖ్యాతలేంద్ర
తిలకమగు నాత్మజామాతఁ ♦ గొలిచి వెంటఁ
బోవ నియమించి శుద్ధాంత ♦ మునకుఁ బోయి
తనదు దేవేరితోడ ని ♦ ట్లనియె నృపుడు. 191

క. మన ముద్దుపట్టి భాగ్యం
బనితర సులభంబు మోహ ♦ నాంగుఁడు విద్యా
ఘనపదవి నమ్రనానా
జనపతి వరుఁడయ్యెనిఁక వి ♦ చారంబేలా. 192

గీ. తగినబుద్ధులుచెప్పి యా ♦ తలిరుఁబోఁడి
ననుఁగుఁ గూఁతును నిప్పుడ ♦ యనుపు మనిన

విన్నఁదనమున వసివాడి ♦ కన్నుఁగొనల
నీరుదొలఁకంగఁ బలికె న ♦ న్నీరజాక్షి. 193

క. నాచిన్నిముద్దుఁ గూఁతుర
నాచక్కని తల్లికాన ♦ నా మదిలోనన్
దోఁచినచింతల నెచ్చో
నే చందమునం జరింతు ♦ నే యిటఁ జెపుమా. 194

క. కులమును రూపును ప్రాయము
నిలువడియును గలుగు వరున ♦ కీఁగంటి నినున్
దొలినా నోఁచిన నోములు
ఫలియించెం జూవె వికచ ♦ పంకజనేత్రా. 195

క. ఏ తెఱంగున నీమగనిన్
బ్రీతునిఁ జేసెదవో మెట్లు ♦ పెంపొందెదవో
నీ తెలివియు నీకడఁకయుఁ
జూతముగా యింకనో వి ♦ శుద్ధచరిత్రా. 196

క. నీమగఁడు భానువంశో
ద్దాముఁడు నినుఁగన్నతండ్రి ♦ ధవళాంశు కుల
గ్రామణి యీయుభయకుల
శ్రీమించఁగ జేయనీక ♦ చెల్లుఁ గుమారీ. 197

క. మూసిన ముత్యములై కడు
వాసియు వన్నెయునుగలిగి ♦ వరుఁడో ననఁగా
నీ సకల బంధుకోటికిఁ
బూసలలోదార మగుచుఁ ♦ బొసఁగ మెలఁగుమీ. 198

క. నీవేమియుఁ బతివేఁడకు
దా వేడుక విభుఁడొసంగఁ ♦ దగ దనకు నినున్
రావింతుఁ దడవునేయకు
రావింపమి నటకుఁ జేర ♦ రాకు లతాంగీ. 199

క. మగఁడెవ్వరిఁ దెగఁజూచున్
మగఁ డెవ్వరిఁ బ్రోచు నట్టి ♦ మాడ్కి న సతికిన్
దగు నడవ దేవుఁ డనఁగా
మగఁ డనఁగా వేఱుగలదె ♦ మదగజ గమనా. 200

సీ. నామాఱుగానింత ♦ నాఁటనుండియు విన్న
వేడ్కఁబెంచిన దాది ♦ వెంట రాఁగ
సకలవిద్యా విచ ♦ క్షణత మించిన యట్టి
వెరవరి సైరంధ్రి ♦ వెంటరాఁగఁ
బ్రాణము ప్రాణమై ♦ పాయక నినుఁగూడి
విహరించు చతురిక ♦ వెంటరాగ
హితవు విశ్వాసంబు ♦ నెఱుకయుఁ గలిగిన
వృద్ధకంచుకులెల్ల ♦ వెంటరాఁగ

గీ. సంతతాక్షీణ దాక్షిణ్య ♦ జన్మభూమి
ప్రియ కళాలాపఘన నీదు ♦ పెండ్లికర్త
యాశుకీ భర్త వెంటరా ♦ నిప్పుడింత
దలఁక నేటికి నీవు నా ♦ తల్లి కాన. 201

సీ. కాళాంజి పట్టు ని ♦ క్కలికి గాఁడేంద్రి నం
దన దీనిలెస్సగా ♦ మనుపవమ్మ
కుంచియవైచు నీ ♦ కోమలి చోళక
న్యక దీని మన్నన ♦ నడపవమ్మ
యడపంబు పట్టు నీ ♦ యతివ మాళవరాజ
సుతదీనిఁ జులుకగాఁ ♦ జూడకమ్మ
బాపడవట్టు నీ ♦ పడఁతి మాగధు కూర్మి
బిడ్డ దీనిఁ దలంచి ♦ పెంచవమ్మ

గీ. పసిఁడి పావలువెట్టు నీ ♦ పద్మగంధి
పాండ్యభూపాలు గారాపుఁ ♦ బట్టిదీని
ననుదినంబును నరసి కా ♦ పాడవమ్మ
వలయు వారలఁ దగురీతి ♦ మెలఁపవమ్మ. 202

వ. అనియద్దేవేరి తనముద్దుఁగూఁతునకుఁ బెద్దయు బుద్ధులు చెప్పి యచ్చి
లుకజేని మొగంబై యిట్లనియె. 203

క. మాపాలి భాగ్యదేవత
వై పేరునుఁ బెంపుఁగల మ ♦ హారాజునకున్
జేపట్టి పెండ్లిచేసితి
వీపాపను నిన్ను వేఱ ♦ యేటికిఁ బొగడన్. 204

సీ. అనునయోక్తులు పల్కి ♦ యత్తమామల కాత్మఁ
గృప పుట్టఁగా నప్పు ♦ గింపవయ్య
సకలబంధులకు వం ♦ చనలేక వినయంబు
సేయఁ బల్మరు బుద్ధి ♦ చెప్పవయ్య
పతిచిత్తవృత్తి రా ♦ సతతంబు విసువక
సేవయొనర్ప శా ♦ సింపవయ్య
కిన్కసి యెవ్వారి నో ♦ చ్చిన నోరఁబల్కక
యోర్పుమై నుండంగ ♦ నేర్పవయ్య

గీ. యెల్లవారలవలె నేమి ♦ యెఱుఁగవయ్య
నిన్నియును నేలనీచేతి ♦ కిచ్చినార
మీ కుమారిక మీచిత్త ♦ మెట్లువచ్చు
నట్టిజాడలఁ గరుణఁజే ♦ పట్టవయ్య. 205

క. పలుమఱు నీగతి నవ్విభు
కుల పాలిక బుద్ధిచెప్పి ♦ గుణశాలికి న
ప్పలుకుం దేనియ కొలఁకుకుఁ
జిలుకకుఁ దగ నప్పగించెఁ ♦ జిలుకల కొలికిన్. 206

క. అప్పుడు శుకకుల చంద్రుం
డప్పాటలగంధి కనియె ♦ నంగన ప్రియముల్
చొప్పడఁ బెఱవారికి బలెఁ
జెప్పదు నన్నింత వేఱు ♦ సేయం దగునే. 207

క. కుటిలాలక నీపుత్త్రిక
యెంట యొట గుణశీల గరిమ ♦ మడుగంగ నేలా
నిటలాంబక కులకాంతకు
నిటువంటి వివేక మేది ♦ యే నెఱుంగుదుంగా. 208

గీ. ఉభయవంశ పవిత్ర యీ ♦ యుత్పలాక్షి
సర్వలక్షణ సౌభాగ్య ♦ జన్మసీమ
యీకుమారిక చొచ్చిన ♦ యిల్లుఁబుట్టి
నిల్లు నెంతయు వన్నెకు ♦ నెక్కు-కున్నె. 209

క. పతియునుఁ దానన్యోన్య
స్థితి నిప్పుడ కలసిమెలసి ♦ చెలులన్ మనలన్
మతినొకనాఁడుఁ దలంపదు
గత మించ్చెద దీనికేమి ♦ కంజాతముఖీ. 210

క. పట్టానదేవియై నీ
పట్టి జగం బెల్లమెచ్చఁ ♦ బతిమానస మి
ట్టట్టు చననీక యున్నిట
జట్టిగొనన్నేర్చు నీవు ♦ సంతసమందన్. 211

క. దినముల వెంబడినన్నియు
వినియెద వేటికి వచింప ♦ విభునింటికి నీ
మనసునఁ దెలివిడికూఁతుం
బనుపుమనం దనయఁజూచి ♦ పైకొను మమతన్. 212

గీ. అమ్మహారాజదేవి యి ♦ ట్లనియె మగుడ
నన్నుమన్నించి యీ శుక ♦ నాథుపల్కు-
లేమి జవదాఁటకుండుమీ ♦ యిదియు నీకుఁ
బరమమైనట్టి బుద్ధిపోఁ ♦ బద్మగంధి. 213

క. మనమున దయపుట్టఁగ నీ
పనిపాటలు విన్నవించుఁ ♦ బ్రాణేశునకీ

యనఘుఁడ కారణబంధుం
డని తెలియుం బలికి గుండి ♦ య దిగు ల్లనఁగన్. 214

క. తలగుచ్చి కౌఁగిలించుచుఁ
దెలిగన్నులనీరు దుడిచి ♦ దీవించి నిర్మ
సలువదినాళ్ళకె తోడనె
పిలిపించెద నింతయేల ♦ బెగడకు తల్లీ. 215

గీ. అనుచునూరార్చి పదపమ్మ ♦ యనుచుఁ దానుఁ
బ్రాణసఖులును గత్యాంత ♦ రములుగడచి
దిడ్డివెచిన రొకనూత్న ♦ దివ్యరత్న
ఖచిత మగు పల్లకీ మీఁదఁ ♦ గన్య నునిచి. 216

గీ. ఎట్టకేలకు నప్పు డయ్యింతి యంతి
పురములోనికి వసివాడి ♦ యరిగె మగిడి
మగిడి చూచుచు నెంతయు ♦ మహిమ నిచటఁ
గంచుకులవాక్య వైఖరి ♦ గ్రందుకొనఁగ. 217

గీ. వల్లకీ పాణి పల్లకి ♦ యల్ల నల్లఁ
బురము వెల్వడ సింధు భూ ♦ వరుఁడు దాను
దండనాథులు సకలబాం ♦ ధవులు వెంట
లీలమై నేగిరపుడ త్తే ♦ జీలనెక్కి. 218

సీ. ఆరీతి నేగి ము ♦ వ్వఖిల సేనాసమే
తుఁడయి వెలిని వీడు ♦ విడిసియున్న
మనువంశపతిఁ జేరఁ ♦ జని ముద్దుఁ గూతును
నప్పగించి విచారమా ♦ వహిల్ల
నొకభంగినెగె న ♦ య్యుర్వీ తలాధ్యక్షుఁ
డిట హైమధన్వియుఁ ♦ జటుల పటహ
మురజ మర్దలరావ ♦ ములు మిన్నుముట్టఁగఁ
గన్యకా సహితుఁడై ♦ కతిపయ ప్రి

గీ. యానములనాత్మపురిఁ జేర ♦ నరుగుదెంచి
యప్పుడద్వార్తఁ దండ్రికిఁ ♦ జెప్పి పనుప
సమ్మదాంభోధి నోలాడి ♦ సకలబలము
నెదురుగాఁ బరిచె నా వంచ ♦ కేశ్వరుండు. 219

వ. ఇట్లు సకలసేనా సమన్వితుండగుచు నక్కుమార పంచాననుం డకించి దంచిత కాంచన కదళికా నికాయచ్ఛాయాజానుమాన కాయమాన గృహ బహిర్భాగంబునఁ దరుణ తరణి రోచి స్సమిరాచీన చీనాంబర విరచిత వితాన ప్రతానంబును వధూవర వరసౌందర్య సందర్శన కుతూహల సముత్పత త్పక్ష్మలాక్షీ కటాక్ష వీక్షా విలక్షితాక్ష యాగురుధూప ప్రదీపిత గోపురంబునుఁ బటు పటహ ఘణవ ఝర్ఝ హుడుక్కా రావ బధిరితా శావకాశ ముఖంబును గనక రుచి విస్ఫురత్వ రతత్పరాభి యుక్త ముక్తారంగ వల్లికంబును ఘుసృణ కుసుమ రసాలేపిత వితర్దికంబును బునః పునరుద్గీర్ణ పౌరకుల సంకుల సంకుమదాంకిత రాజ మార్గంబును లోహిత విహితాగ్ర తోరణ మాలికా శాలికలధౌత సౌధతలంబును రంగ త్తురంగ లోచనాంగీ కృతలాస్య ప్రశస్య మంగళ సంగీత ప్రసంగానుషంగ మృదంగ ధిమ ధిమధ్వాన తరంగిత మంచికా సంచయంబును నగుపురంబు ప్రవేశించి ముహుర్ముహురన్యో న్యాహూత కన్యకాజన లతికానికర కలితకుసుమ సమాజ భ్రాజమాన లాజాక్షతంబుల వలనం బురంధ్రీ విరచ్యమాన నీరాజన విరాజ మానంబుల వలనం బృథ్వీ సురాశీర్వాదంబుల వలనం బ్రముదిత హృదయుండై రాజగృహద్వారంబు చేరంజని నిజవాహ నావతరణం బొనరించి సౌవిదల్ల వృద్ధామాత్య సామంత సైనిక ప్రవరుల నుచిత వచన శిరః కంపకర సంజ్ఞా విలోకనంబులఁ దగినచందంబున ననిచి కక్ష్యాంతరంబులు గడచి యయ్యవసరంబున. 220

ఉ. ఉల్లము పల్లవింప విన ♦ యోన్నతిఁ జేరి సుధా మరీచి మే
నల్లునిఁబోలు నమ్మనుకు♦ లాగ్రణి మత్త విరోధి దైత్య సం

పల్లతి కాశితాసి పరి ♦ పాండురకీర్తి ససంభ్రమంబునన్
దల్లికిఁ దండ్రికిన్ సుదుజ ♦ నంబులకున్ ధర,జాగి మ్రొక్కుడున్.

ఉ. గ్రుచ్చి కవుఁగిలించుకొని ♦ కోరిక తీరిక లెత్తనమ్మహీ
భృచ్చతు రాననుండనిమొ ♦ భీకరదైత్యుల నుక్కడంచి నీ
వచ్చుటఁజేసి ప్రాణములు ♦ వచ్చెఁజుమీ యిట నేఁడు మాకు వి
వ్వచ్చుఁడు పోరులన్ సవతు ♦ వచ్చునె నీ కసమానమానుషా. 222

మ. రణసీమన్ సురకోటినొంచి ఖచర ♦ వ్రాతంబుఁ దూలించి చా
రణులం దర్పమడంచి బాహుబల గ♦ర్వ స్ఫూర్తిమాల్లేక భీ
షణవృత్తిన్ విహరించు దైత్యునొరులే ♦ సంధించు వారివ్వకా
రణజన్ముండవు గానఁగూల్చితి కుమా ♦ రా రాజకంఠీరవా. 222

వ. అని బహువిధంబులం బ్రశంసించి పునః పునరాలింగనం బొనరించి యన్నరదేవుండు దేవియుం దానును బరమానందంబునం బొంది యుండ 224

క. కోమల పల్లవ పాణిం
గోమలి నమ్ముద్దుఁ బెండ్లి ♦ కూఁతును నొకమైఁ
దా మొయ్యఁ దార్చియత్తకు
మామకు మ్రొక్కించి రపుకు ♦ మంజులవాణుల్. 225

క. మ్రొక్కిన కోడలిఁ గొమ్మం
జక్కని జవరాలిఁజూచి ♦ సతియును బతియున్
మిక్కిలి యక్కఱ మీఱన్
బెక్కువిధంబుల నుతించి ♦ పేశల ఫణితిన్. 226

క. రావమ్మ సింధుపుత్త్రి
పావనచారిత్రి నేత్రి ♦ పర్వముగాఁగన్
నీవుచుఁ బతియును దేవియు
దేవరవలె నుండుఁడనుచు ♦ దీవించి తగన్. 227

క. కులదేవతానమస్కృతి
సఁలు పన్నరనాథుదేవి ♦ చక్కని తన ము

స్థలకోడలిఁ జెయిపట్టుకొ
ని లీలమైఁ జనియె నిచట ♦ నృపతియుఁ బ్రీతిన్. 228

శా. ఓనిర్నిద్ర భుజప్రతాప తపనా ♦ యోబంధు చింతామణీ
యోనారీ మకరాంక యేపగిది న ♦ య్యగ్నిసురున్ గెల్చితో
మానిశ్రేష్ఠ ని పట్టినట్టి కరణిన్ ♦ మళ్ళించితో స్వామున్
నీవుల్లాగఁ జెప్పుమన్న నతఁడా ♦ విఖ్యాత సమ్మోదియై. 229

క. రాచిల్క మోము చూచుచు
నాచందం బదియెఱింగి ♦ యనశ్వరుతోఁ
దూచాతప్పక యుండఁగ
వాచా గోచరవిశేష ♦ వైఖరి మెఱయన్. 230

సీ. తొలితొలిఁ గవ్వంపు ♦ మలకు నేగి విశంక
టుని భుజాదర్ప మా ♦ ర్చిన విధంబుఁ
బ్రత్యక్షమైదివ్య ♦ రత్నంబుఁ గాళి యి
చ్చినయట్టి విధము ను ♦ దన విధంబు
ముష్టింపచ స్వామి ♦ ముద్దుఁగూఁతును దెచ్చి
యతని కర్పించిన ♦ యవ్విధంబుఁ
బదరికాశ్రమభూమిఁ ♦ బారికాంత్రులచేత
దీవనల్ చాలఁ జెం ♦ దిన విధంబు

గీ. నుత్సవాహ్వయ వనసీమ ♦ నున్న విధము
భవ్యగుణ ధన్యసింధు భూ ♦ పాలకన్యఁ
బెండ్లియాడిన విధము నొ ♦ ప్పిదముగాఁగఁ
దేటపడఁ జెప్పె రాచిల్క ♦ మేటి యచట. 132

వ. అట్లు పలికిన యక్కీరసునాసీరు మెచ్చుల వల్కుల కమ్మహీభృచ్చతురాననుం డిచ్చ నచ్చెరువంది నిష్పందానంద కందళిత హృదయారవిందుండై సుఖంబుండె, నటరాజశేఖర కుమారుండును గాంతిమతీ కుమారికా సమేతుండై. 232

ఉ. ఈడిత మాధవీ కుటజ ♦ హింజుల వంజుల మంజుకానన
క్రోడములన్ విహారగిరి ♦ కూటములన్ దమకంబు త్రోపు త్రో
పాడ మనోనురాగ మన ♦ యంబునలోఁ బొలఁకొండ మన్మథ
క్రీడలు సల్పుచుండె నుర ♦ రీకృత సౌఖ్య కళాభిరాముఁడై 233

ఉ. సారసలోచనా కుసుమ ♦ సాయక బంధుర దాన తోయ వి
స్తారిత పంచశాఖతల ♦ సంజనిత ప్రథమాన వల్లికో
దార కృపాణికా విమత ♦ ధాసిత గోపురవాహ రత్నదు
ర్వార మదాంధ సింధుర ధ ♦ రాభరణైక మహాధురంధరా. 234

మాలిని. కుసృతి పరమహో రా ♦ ట్కూట వృక్కానృగసర్పి
మసృణ కరకృపాణీ ♦ మార జిన్మాళి సింధు
స్వస్ప విమలయశశ్శ్రీ ♦ క్షాళితా శాంతదానా
ప్రస్మృతి సలిలధారా ♦ ప్లావితాంభో నిధానా. 235

శా. స్వర్భామా జనకీర్తనీయ గుణ ఘో ♦ షద్వట్ప్రితాపార్యమ
స్వర్భానూద్భట పారసీక ఖరిచీ ♦ సౌవీర ఘోటీ ఖురా
విర్భూతోద్బల ధాటిధూళిభర దో ♦ ర్వీర్యా వధూలార్జునా
గర్భస్థాపిత భూర్భువ ప్రముఖలో ♦ కస్వచ్ఛ కీర్తిచ్ఛటా. 236

గద్య.

ఇది శ్రీమ దఘోర శివాచార్య గురు కరుణా విశేషలబ్ధ సారస్వత
మాదయామాత్య పుత్త్ర మల్లయ నామధేయ ప్రణీతం
బయిన రాజశేఖర చరిత్రంబను మహాప్రబంధంబునందు
సర్వంబును దృతీయాశ్వాసము.

---

—